# కథాకదంబము

'శిరోమణి'

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

SANSKRIT LECTURER

RAJA BAHADUR VENKATRAMA REDDY'S

WOMEN'S COLLEGE, HYDERABAD.

1960

# తొలినుడి

శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి— ఈ పేరు తెలంగాణమునుండి యావదాంధ్రమునకు నాలుగు దశాబ్దాలుగా వినవచ్చుచున్నది. పువ్వులతోఁట, జాతక కథాగుచ్ఛము, తత్సమచంద్రిక, రేణుకవిజయము, వివేకానందము, కీరసందేశము, ద్వంద్వయుద్ధము, ఖడ్గతిక్కన, కావ్యాలంకారసంగ్రహవివరణము మొదలగు గ్రంథములాంధ్రమునను, పూర్ణపాత్రము, త్రికము, రామదాసము మొదలగునవి సంస్కృతమునను రచించి ప్రఖ్యాతులై యున్నారు.

వీ రొకప్పుడు శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారికడ శుశ్రూష యొనర్చినవారు. ఆ వ్యక్తి ప్రభావము వీరిమీఁదఁ బ్రసరించినను వొణఁకని సనాతనాత్మగనే నిలిచి, నేఁటికినిఁ గావ్యసరస్వతికి నివాళు లర్పించుచున్నారు.

ఏ కావ్యముఁ జేతఁ బుచ్చుకొన్నను "పిల్లనవ్వుల జిగిజాలో? మల్లెపువ్వుల జల్లో?" అన్నట్లు శాస్త్రిగారి పద్యములు నడచును. "పారిజాతాపహరణము" ను నపహరించినట్లుండును. ఇది వారి కవితావైఖరి.

తెలుఁగు భాష సంస్కృత వ్యాకరణ శృంఖలాబద్ధమని కొఱుకుడు వడక యాంధ్ర పండితులు విసుగుకొనుచున్న కాలమున "తత్సమచంద్రిక" ను నిబంధించి యా బంధమునుండి తప్పించి దానిని స్వతంత్రము గావించి యాంధ్ర విద్యార్థులకు మహోపకార మొనర్చినారు. వీరి కాంధ్ర పండితులు మిక్కిలి ఋణపడి యున్నారు.

ఉభయభాషా పాండిత్యము గలవా రుందురు. సరసకవితాధార గలవారును గలరు. కాని పాండిత్యము, సరసకవిత్వము, భాషాదేవికి నిత్యార్చనసేయు నాసక్తి గలవారు వీరివంటి వా రెందఱు గలరు?

ఏ బీజము పడినను బాల్యముననే పడవలెను. కౌమారముననే ధర్మము నాచరింపవలెనని యాజన్మభక్తుఁడైన ప్రహ్లాదుని యాహ్లాద వాక్కు.

ఈ గ్రంథమును విద్యాధికారులు సమాదరించి, చిన్నపిల్లలకుఁ బఠనీయమొనర్చి, తమ పెద్దఱికమును జూపుకొనవలసియున్నది. ఈ పెద్దలే "మైనర్లు"గఁ జిర శిశుత్వముతో నుండినచో నంతకన్న దుఃఖింప వలసినదిలేదు.

ఆంధ్రావళి దీనిని సమాదరించుఁగాక !

శ్రీరామకృష్ణమఠము
రాజమహేంద్రవరము
11—2—1960

స్వామి నిర్వికల్పానంద

# విషయసూచిక

## పరమహంస కథావళి

## శివానంద కథావళి

## రామదాస కథావళి

# పరమహంస కథావళి

## ౧. వృషభ సృగాలములు

ఆ. సంకువోసినట్లు చక్కఁగాఁ జిక్కఁగాఁ
గండవట్టి లెస్స కావరించి
వృషభరాజ మొండు వెడలుచుండెను; దాని
పిఱుఁద నక్కయొక్క టరుగుచుండె.

కం. అది నిలిచిన నిది నిలుచును;
గదలిన నది తోడ నిదియుఁ గదలు; నెమర్పన్
అది, యిది గుటకలు మ్రింగును;
సుదూరము సృగాలమిట్లు సురిగె వృషముతోన్.

ఆ. "ఊడిపడుఁ దదండయుగ మిప్పుడో! యప్డొ!
తనివిదీఱ దానిఁ దినుదు" ననుచుఁ
బవలు రేలు వార పక్షముల్ మాసము
లంటిపట్టియుండె నా వృషంబు.

కం. ఎన్నాళ్ళకైన నయ్యవి
యున్నవి యున్నట్టులుండె నూడిపడ కయో!
అన్నక్క యాస లడఁగఁగ
విన్నఁదనము మొగమునందు వ్రేలఁగ మరలెన్.

కం. దినదినము ముఖస్తుతులను
బొనర్చుచును ధనికవర్గముపిలుందను రే
లును బవలును గాళ్ళలుగఁగ
జనములు పేరాస నిల్లై చరియింత్రు వృథా !

## ౨. వర్తకుఁడు

గీ. అపరవిష్ణుమూర్తి యనుకొనఁ దనుఁగాంచి
ద్వాదశోర్ధ్వ పుండ్రధారి యగుచుఁ
దులసితావళంబు గళమందు, జపమాల
క్రాలఁ గేల నొకఁడు గలఁడు బేరి.

ఆ. ఇతఁడు పరమ భాగవతుఁ డహో ! సూనృత
వాది, గంగిగోవువంటివాఁడు;
నమ్మకస్థుఁ డంచు నమ్మి నానాక్రయ
విక్రయికులు వచ్చి వెడలుచుంద్రు.

గీ. బేరగాం డ్రాపణమున కేతేర నొకఁడు
"కేశవా ! కేశవా !" యంచుఁ గేఁకరించు ;
నను "గోపాల ! గోపాల !" యని మరొండు
"హరి ! హరీ !" యంద్రు "హర ! హరా!" యంద్రు పెఱలు.

కం. విని యీదృశ భగవత్కీ-
ర్తనం బమాయిక జనంబు దలఁచె గుమాస్తా

లును సెట్టియుఁ బుణ్యులుగాఁ
'బునీతులమ ; యచటఁ గొనఁగఁబోయిన' ననుచున్.

గీ. 'ఎవరు వీ ?' రని ప్రశ్న 'కేశవ !' యటన్న
'ఆలమం' దని బదులు 'గోపాల' యన్న
'నయిన దోఁతమె ?' యని ప్రశ్న 'హరి ! హరి !' యన
'నట్లి కాని' మ్మని జవాబు 'హర ! హర !' యన.

క. అరయఁగ వాణిజ్య కళా
పరిభాషాపదము లివ్వి ; పరజనుల కగో
చర మేతదీయమర్థము ;
గఱచిన షట్చాస్త్రములును గాదెఱుఁగంగన్.

## 3. ముక్తులు – బద్ధులు

క. వలపఱచె నొక్క జాలరి
జలాశయమునందు ; వాని జాడ నెఱిఁగి యా
వలఁ జొరక కొన్ని మత్స్యం
బులు దొదవ్వులకుఁ బాఱె మునుముందె తగన్.

గీ. కొన్ని వలఁజిక్కి గిలగిలతన్నుకొనుచుఁ
బరుగువాఱుచు నాలుగువలఁకులకును
బయటఁబడఁ ద్రెంచుకొని త్రాళ్ళ ప్రయతపడును ;
ఎగిరి తప్పించుకొని పోవు నేయొకండొ !

గీ. తమ్ముఁ దప్పించుకొనఁగ యత్నమ్మొనర్ప
కలఁతి యేనియు, నోటితో వలను గఱచి
యూఁబియడుగునఁ గూర్కొనియుండెఁ గొన్ని
"యినుపకోటను గలము మాకే" మటంచు.

క. అఱనిముసములో నాజా
లరి యచటికి వచ్చి యవ్వలను బలిమి మెయిం
బెఱుకంగ వెలికి, నయ్యవి
పురపుర పొక్కుచును బ్రాణములు విడనాడెన్.

గీ. నిత్యముక్తులు గొంద ; అనేకమంది
బద్ధు ; లాబద్ధకోటిలో బంధమోక్ష
మెవ్వఁడో పొందు ; లాఁతు లిస్సీ ! స్వకీయ
బంధముక్తిఁ దలంపక వ్రాల్తు రొడలు.

## ౪. కౌపీన రక్షణము

క. నరగంధమేని సోఁకని
పురసీమాంతమున నొక్క ముని యాశ్రమ మే
ర్పఱచుకొని పర్ణశాలను
గురునానతి నొకటి గట్టుకొనియు వసించెన్.

గీ. మేలుకొని కోడికూసెడువేళఁ, గొండ
వాఁగున మునింగి యొక గోచిపాఁతఁదాల్చి

క్రుంగును సమాధి; మధ్యాహ్నమునకులేచి
ప్రతిదినము భిక్షకై పోయివచ్చు నతఁడు.

క. కని యాయన వైరాగ్యముఁ
గనియుఁ దపోనిష్ఠ మహితుఁగాదలఁచి మనం
బున నహమహమికతో భి
క్షనిడం గాంక్షింతు రచటి గ్రామీణజనుల్.

ఆ. తిరిగి వచ్చుసరికిఁ దిరిపెంబునకుఁబోయి
కొట్టివేసె నెలుక గోచిపాఁత
నొక్కనాఁడు; మరియునొకనాఁడు; మర్నాఁడు
గోడుగుడువ మౌని గోచిలేక.

ఆ. భిక్షతోపా టతండు గౌపీనమునకు
వారివీరిని యాచింపఁ బ్రత్యహంబు
"పిల్లిఁబెంచుము మూషకపీడ వదలు
నీ" కటంచును నుడివె మానిసి యొకండు.

గీ. నచ్చి యాయుపదేశ మానాఁడె యతఁడు
గ్రామమంతయుఁ గ్రుమ్మరి కష్టముపయిఁ
బిల్లికూనను గొనితెచ్చి పెంచఁదొడఁగె
వారి వీరిని బ్రతిమాలి పాలుదెచ్చి.

ఆ. ఆశ్రమంబునందు నా బిడాలార్భకం
బడుగువెట్టినట్టి యా ముహూర్త

మెంత దివ్యమో? మునీంద్రుని కయ్యాఖు
బాధ వదలె! నిద్రపట్టె లెస్స.

ఆ. ఆఱవేసినట్టి యతనిగోచీపాంత
చెక్కు చెదరకుండెఁ జెట్టుపైని;
నా బిడాలమూర్తి నందెను దనతపః
ఫలమటంచు మౌని యెలమినొందె.

గీ. జపము సాలించి యతఁడు మార్జాలశిశువు
క్రీడితంబులు నవ్వ వీక్షించుచుండుఁ;
గ్రమ్మఱ జపింపఁగూర్చుండుఁ గనులుమూసి;
మరలఁ గాంచును; వెండియు మౌనమూను.

ఆ. సన్నగిల్లఁ దనదు జపతపంబులు మౌని
పాలకోసమయి ప్రభాతమందె
పాత్ర చేతఁబూని బయలుదేఱు దినంబు
వీథివీథి జనులు విసుగుకొనఁగ.

గీ. "భిక్షసేతుముగాని నీ పిల్లికూన
కెవఁడు పాల్పోయఁ గలఁడయ్య! యెల్లకాల?
మొక్కపాడావు విలుచుకొ; మ్మొసఁగుఁ బాలు
నీకు నీ పిల్లి" కంచు ననె నొక్కరుండు.

ఆ. పాదుకలను దొడిగి పరలోక యాత్రకై
బయలుదేఱుతంటిడివల సుతులు

ఆఱిపోవుదీప మట్లున్న గోవు ని
ప్పించి యతికిఁ దోలిపెట్టినారు.

ఆ. వాని పున్నియమున బ్రదికి యా మొదవాశ్ర
మమున మేసి రేవుమాపు లోలి
బలిసి యీఁదొడంగెఁ బాలు సమృద్ధిగా
యతికిఁ బిల్లికూన కనుదినంబు.

గీ. వేకువనె లేచి పాల్పిండి పెండఁ దీసి
కట్టుచోటూడ్చు ; యాచించి గడ్డిఁ దెచ్చుఁ ;
గొడవలియు గంపఁ గొంపోయి కోసితెచ్చి
పచ్చిగడ్డిని దానికి వైచుఁ దబిసి.

ఆ. వాని తపముఁ బిల్లికూన నాకెను గొంత ;
గోవు మేయుచుండెఁ గొంత యిపుడు ;
అయిన నప్పుడప్పు డది వేయు మూరాకుఁ ;
గాని మాడిపోవుఁ గాపు లేక.

గీ. పరిసరగ్రామములపైకి మరల మరలఁ
దత్పశుగ్రాసయాచ్ఞతో దాడివెడలు
నాయతీంద్రుండు ; వారని "రయ్యగారు !
మొన్ననే కద వచ్చినా రొప్పెండు నేఁడు."

క. మరియొకఁడనె "నయగారూ !
అఱుగంగాఁగాళ లిట్టు లాయా యూళ్ళం

దిరుగంగ నేల ? కృషి నా
చరింపుఁ దొక పొలమువిలిచి చక్కఁగఁ బండున్.

ఆ. ఇట్టియాలఁ బదింటినే నేలవచ్చు ;
భిక్షవేఁడక తినవచ్చుఁ ; బెట్టవచ్చు"
నని వచింపఁగ నాఁడె సన్న్యాసి వచ్చి,
యాశ్రమప్రాంత భూమిని నాక్రమించె.

క. పని పెరిగెను దలమునకగఁ ;
బనివాండ్రఁ గుదిర్చె జీతబత్తెము లిడి నే
లనుదున్న, విత్త, బైరులు
పెనుపంగాఁ గోసి నూర్పింపఁగ గుప్పల్.

క. అనుదిన మేదో పనివడి
ముని త్రుమ్మరివచ్చుఁ బ్రొద్దుపోయిన పిదపన్
దనయిల్లు సక్కఁబెట్టగఁ
దనకన్న మమర్ప నొకరతనికిన్ వలసెన్.

ఆ. చెట్టవట్టె నొక్క చిన్నెలాఁడి నతండు
బంటుపైదలింట బలిసిరంత
వానినేల పసిఁడిపండె; నాతని సిరి
పెరిగె హనుమతోఁక పెరిగినట్లు.

క. క్షణమేనిఁ దీఱుగడ యా
తనికిన్ లభియింపదయ్యెఁ దపమున కిట్లా

ముని పిల్లజమీందార
య్యెనుబో ! కొన్నాళ్ళలో నదృష్టవశమునన్.

క. అరుదెంచి గురుం డొకపరి
చరణంబుల వ్రాలినట్టి ఛాత్రునడుగ "మ
చ్చరితంబంతయుఁ గోపీ
నరక్షణార్థ"మని సిగ్గునన్ బదులాడెన్.

క. "గురుదేవా ! యిచ్చట నా
పరిచర్యం గొనుచు మీరు వసియింపుఁ" డటం
చెరగఁగ శిష్యుఁడు గురుఁడనె
"సరవిని నీయంతవాని సలుపుదె నన్నున్."

## ౫. తోఁటమాలి - బెస్త

కం. ఒక తోఁటమాలి యింటికి
సకురాలగు బెస్తపడఁతి చనుదెంచెను ము
న్నొకరేయి; దాని కయ్యది
యకృత్రిమంబైన ప్రీతి నాతిథ్యమిడెన్.

గీ. అచట నచ్చికబుచ్చిక లాడుకొనుచుఁ
గుడిచి కడుపారఁ బ్రొద్దువోవుడును వారు
పండుకొన లేచి చాపలు పఱచుకొనిరి
పూలగంపానుకొని పాకమూలయందు.

ఆ. అలరుపుటిక కమ్మవలపుఁ జిమ్ముచునుండెఁ
గూర్కురాక బెస్తకూఁతు రచట
నిఱుగెలంకులకును బొరలాడుఁ; జీదర
వడుచుఁ గూరుచుండుఁ; బండు; లేచు.

ఆ. అడిగెఁ దోఁటమాలి "అక్క! నీ విట్లేల
పొరలుచుంటి నిద్రపోక ?" యనుచుఁ
బదులుపలికె బెస్తపడఁతి "యేమోనమ్మ!
అలరుకంపు గిట్టనట్టు లుండె.

కం. నా చేఁపలబుట్ట నెటం
దాఁచితివో తెచ్చియిమ్ము దయచేసి" యనన్
అచాన యొసఁగె; దానిని
మూచూచుచు బెస్తపొలఁతి పోయెను నిద్రన్.

కం. పరమేశ్వరు చరణాంబుజ
పరిమళము రోసి మూర్ఖు ప్రాపంచిక దు
ర్భర వాసనకె తపించును;
నిరయంబే స్వర్గ మాతనికిఁ దలపోయన్.

## ౭. కపటయోగి

కం. కలఁ డొక్కయోగి; వానికిఁ
దెలియు ద్వ్యక్షీత్యాసనము; లతీతుండని లో

కులు శ్లాఘించుచుఁ దచ్ఛి
ష్యులుగానయి పాదసేవ లొనరింత్రెపుడున్.

ఆ. లంబికాదు లాసనంబులఁ జూపును
సాముచేయువాని చందమునను;
బ్రహ్మరథముఁబట్టి ప్రజలెల్ల రాతనిఁ
బరమపురుషుఁడంచు భక్తి సేయ.

క. మూరెఁడు గడ్డంబును, దెగఁ
బారెఁడు జడగుంపుఁ, గాళ్ళఁ బావలుఁ, గేలం
దీర్ఘైన యోగదండముఁ;
బేరొందెను రాజయోగివేషముతోడన్.

ఆ. ఆత్మదర్శనమున కరుదెంచి పోయిన
ఛాత్రురాలికేలు జారిపడఁగఁ
గాంచి రత్నముద్రికను దురాశనుదీసి
యోగమాయ మ్రింగి యుండె నతఁడు.

ఆ. అంతఁ గొంతతడవు కాచూకిఁ గనిపెట్టి
రాజయోగిఁబట్టి రాజభటులు
గ్రక్కఁజేసి వానికడనున్న యుంగ్రంబుఁ
బంపినారు చెరకుఁ జంపకుండ.

దిండిలేక యెండి యెండి చచ్చియుఁజాక
తిరుగుచుండె వాఁడు దినదినంబు.

ఆ. ఆలకించి చవిటినేల నేద్యముఁబోని
వాని యత్నములను బలికె సఖుఁడు
"కాళులఱుగఁ బవలురేలిట్లు దిరిగెద
వెంతమూర్ఖవోయి! యిట్లుగాదు.

క. తరుణీదాసుం డాతఁడు
దరిసించి గడించికొమ్ము! తదనుగ్రహమున్
దొరకుసుమి! కొలువు రేపే;
పెఱజతనంబులను గట్టిపెట్టుమి! యింకన్"

క. కడుపక్కళించుకొని పోఁ
దొడిగి యొడలిపైని నందదుకులవలువ లా
తఁడు దైన్య ముట్టిపడఁగా
నుడుల, నడలఁ, బోయి యామెనుం దరిసించెన్.

క. విని యాతని కడగండ్లను
గనికరపడి యామె యీయఁగాఁ బోవ నెదో
"జననీ! నీ దయ గావలెఁ
బని లేదన్యం" బటంచు వాఁడు ప్రణమిలెన్.

క. "వలదేని ధనం, బెదికా
వలెనో చెపు" మన్న "నొక్క వాక్సాహ్యము గా

వలెఁ దల్లీ ! నా కేదేఁ
గొలు విప్పింపవలె నయ్యకుం జెప్పి" యనెన్.

క. "ఇదియేకద ! ఈ రాతిరి
గదిలించెద దొరను ; రేపు కనఁబడు" మనె నా
సుదతి ; చని యతఁడు మఱునటి
యుదయమునకు రాఁగ నయ్యయిను నమ్మయునున్.

ఆ. కూరుచున్నవారు కుర్చీలపైఁ ; జూచి
దొల నిలుచు నర్థి దరికిఁ బిలిచి
దొర వచించె "నేఁడు దొరఁకొని రమ్ము ! కొ
ల్వునకుఁ బొ" మ్మటంచుఁ బొలఁతిఁ గాంచె.

ఆ. వందనం బొనర్చి వా రిర్వురి కతండు,
ఏన్గునెక్కి నంత యెలమినొంది,
పోవఁ గొలువుకూటమున కాతనిం జూపి
దొర వచించెఁ బెద్దదొరకు నిట్లు.

క. చుఱుకుగలవాఁడు ; పని నే
ర్పరి ; ఋజువర్తనగలాఁడు ; ప్రాయపువాఁ డే
ర్పఱచితి వీనిని మన కొ
ల్వరిగా, ననఁబలికె నతఁడు "వల్లె" యటంచున్.

క. కదిలింపదయ్యె విప్రుని
యుదితస్వర మకట ! యిన్ని రోజులకును ; ద

న్మదిరాక్షిదైన మంత్రము
కదలించెను దొరను ; దొరకు గరిత దొరగదా !

## ౮. ధనమదము

క. దురదృష్టవంతుఁ డెవ్వఁడొ
పొరపాటునఁ జేయిజార్చి పోఁగొట్టుకొనన్
దొరకిన రూపాయినిఁ దన
బొటియను మండూక మొండు మొగి దాఁచుకొనెన్.

గీ. తన సమీపంబుగాఁ బోవు జనులఁ గాంచి
మున్ను భయపడినట్టిది మొఱుగఁ దొడఁగెఁ;
జిన్నలను బెద్దలను లెక్కసేయఁబోక
మీఁదిమీఁదికి దూఁకం గ్రమించుచుండె.

క. తనబిలము సమీపంబునఁ
జనుచుండఁగ మదపుటేన్గు చయ్యనఁ దన్నం
గను గాలినెత్తి "నా బిల
మునఁ గాలిడ సాహసింతె ? పో ! పో !" యనియెన్.

## ౯. యోగశక్తులు

ఆ. కలఁడు సాదొకం డఖండతపఃక్రీత
దివ్యసిద్ధియగు సుధీవరుండు
బ్రహ్మరథముఁ బట్టవత్తు రాబాల గో
పాల మాప్రదేశ పౌరులెల్ల.

ఆ. మాన్పుఁ దీర్ఘమిచ్చి మానని రోగముల్ ;
భూతినొసఁగి తీర్చు భూతబాధఁ;
జదివి మంత్రముల విసంబు డించునుబో ! మ
హాత్ముఁడౌట కేటి యబ్రమింక ?

క. అనల స్తంభన విద్యను,
ననిల స్తంభనమునందు, నఱిది జలస్తం
భనమున వానికిఁగల ప్ర
జ్ఞనుగూఱిచి వేయినోళ్ళ శ్లాఘింత్రు జనుల్.

ఆ. మూత్రవారి దీపముల వెల్గఁజేయును;
మలముఁ గమ్మవలపుఁ గొలుపఁజేయు;
హృదయచలన మాఁపు; నిట్టి విద్యలచేత
నతఁడు దివ్యయోగి యయ్యె నవని.

గీ. భక్తులును, శిష్య, లభిమానపరులు, దినము
నిచ్చు నప్పనముల వానియిల్లు నిండెఁ;
బట్టుశాటులు, నపరంజిపావకోళ్లు
మెత్త, లొఅగుడుబిళ్ళలు మెండుకొనియె.

ఆ. విప్రవేషమూని విచ్చేసి భగవానుఁ
డొక్కతూరి వానియొద్ద కరిగి
యుబుసుపోక కెవ్వేవో ముచ్చటించుచుఁ
బొగడి తత్ప్రభావమును గడింది.

గీ. "స్వామి ! యడుగుచునుంటి జిజ్ఞాసచేత
సైఁపుఁడీ ! దోసమేని; మీశక్తిఁ గాంచఁ
గౌతుకంబయ్యె; నావచ్చు గజముఁ గనుఁడు !
దాని నీల్గింపఁగలరె మంత్రంబుచేత ?"

గీ. అనుడు "నదియెంత ?" యని కేలఁగొని రవంత
తీసి భస్మంబు సల్లె నా ద్విపముపైనిఁ
గూలి నేలను గిజగిజ కొట్టుకొనుచుఁ
బెట్టుచుంగేఁక లది డింకవేసె నపుడె.

గీ. అక్కజంబు నటించి బ్రాహ్మణుఁడు వలికె
"నద్భుతము ! మీ ప్రభావ మత్యద్భుతంబు !
మరల బ్రదికింపఁగలరె ?" నా స్మయమొనర్చి
వెలిమిడిం జల్లె; మగిడి జీవించె నదియు.

క. కపటావనీసురుండనె
"నపూర్వ మశ్రుతముగద ! మహాత్మా ! నీ శ
క్తి పరీక్షింపఁగఁ; జాలును
గృపతో నాశంకఁ దీర్చి కృతిసేయఁగదే !

క. "కరి భ్రమందించితి త్రుటిలో;
మరలం బ్రదికించి; తిట్టి మహిమముచే నే
మొఱగినది నీకు ? దీనం
బరాత్పరుని దర్శనంబు ప్రాప్తించెడినే ?"

క. అని యడిగి సమాధానం
బున కొక్క ముహూర్తకాలము నిరీక్షింపం
గను దలఁప కదృశ్యుండై
చనె; యోగి ప్రదర్శనములు చాలించె నిఁకన్.

## ౧౦. తరణోపాయము

గీ. బాటసారులు గొందఱు దాటుచుండి
రోడపయిఁ దాళదప్పుమా నొక్కయేఱు
ఆ సమూహంబునందు బ్రాహ్మణుఁడొకండు
పరగుచుండెను షట్ఛాస్త్ర పండితుండు.

ఆ. అతఁడు నూఱిత్రావె శ్రుతులను స్మృతులను
సకల శాస్త్రములను: స్వప్నమందుఁ
బలవరించువానిఁ బదిఁబది ; దొరలించు
భాషణముల శాస్త్ర పంక్తు లెపుడు.

క. తనతోనుండిన యాత్రిక
జనంబునకుఁ దన యఖండ శాస్త్రజ్ఞానం
బును దన జయపత్త్రింబులుఁ
దన బిరుదావళినిఁగూర్చి తద్దయుఁ దెలుపున్.

గీ. చదివితే ? వేదముల; లేదు; చదివినావె ?
తర్కవేదాంతములనొ ? పాతంజలమునొ ?

లేదు; సాంఖ్య మీమాంసలో? లేదు, లేదు;
అడుగునతఁ డట్లు యాత్రికుం డాపు నిట్లు.

ఆ. పుట్టి మడుఁగు నడిమిపట్టున కేతెంచె
నాతఁడిట్లు వాగులాడుచుండఁ
బెనుప్రభంజనంబు వీవందొడంగెను;
గట్ట! పుట్టి మునుఁగునట్టులుండె.

గీ. ఉప్పొంగుచుంటెది మునుఁగుఁ బోలె నుప్పొంగుచుండె
నంతకంతకు ముదురు ఝంఝానిలమునఁ
బడవ తలక్రిందుగానుండె; బాటసారి
యడిగె "నీకీ తవచ్చునే?" యనుచు నతని

ఆ. వేదములునురావు; వేదాంతములురావు;
రావు శాస్త్రములును; రావ యెవియు
స్వామి! యీఁతమాత్ర వచ్చునా; కది రాదె?
ఈ కటంచు నొడివి యీఁదిపోయె.

క. తరణోపాయ మెఱుంగవు
కఱచితి కీరంబువలె సకలశాస్త్రంబుల్
తరియింతువె భవసింధువు?
నరుఁడా! మునుఁగుదువు; నాశనముఁగాంతువు పో!

## ౧౧. కుయుక్తి

ఆ. కట్టుకొని యొకండు గాపురముండెను
గుట్టపైనిఁ బూరిగుడిసె నొండు.
ఒక్కనాఁడు వీచె నూరేఱు లేకమా
నట్టి వానతోడిబిట్టుగాలి.

ఆ. వ్రేళ్ళతోడఁ జెట్లఁ బెకలించు ; దొర్లించు
గండశిలలు ; పట్టి కొండ లూఁపు ;
ఆ మహాబలుం డయారె ; విజృంభించె
జను లకాండవిలయ మని చలింప.

ఆ. అత్తఱిం గటా ! "మహాగజంబులె పర్వ
నింక దోమమాట నెత్తనేల ?"
యన్న పగిది నేల యడుగంగఁ ? జెప్పంగ ?
గుట్టమీఁది పూరిగుడిసెఁ గూర్చి.

ఆ. ఇంటికప్పు మింటి కెగిరిపోవుచునుండెఁ ;
గూలుచుండెఁ గరగి గోడలెల్లఁ
దడిసి ముద్దలయిరి వడవడ వడఁకుచుఁ
బాకలోన నున్న వారలెల్ల.

ఆ. పురుషకారమునకుఁ బోఁజాల కెంతయు
మ్రొక్కసాఁగె దైవమునకు గేస్తు

స్మృతికిరాఁడు దేవుఁ డిల సౌఖ్యములయందుఁ
గష్టకాలమందుఁ గడిఁది వచ్చు.

క. "ఓ వాయుదేవ ! స్వామీ !
నీ విలువేలుపవు నాకు నిక్కంబుగ ; నీ
దేవళమగు నా పాకను
నీవిధి ధ్వంసం బొనర్తు విధి ధర్మ్యంబే ?"

క. అని ప్రార్థించినను బ్రభం
జనుండు శాంతింపకుండె ; జనుఁ డాతఁ డెదం
బని యిదిగాదని హనుమ
జ్జనకుఁడు గద గాడ్పటంచు స్మరియించి యనెన్.

క. "స్వామీ ! యిది నీ పుత్త్ర హ
నూమంతుని యాలయం ; బనూన ప్రేమన్
ఓముము ! దీని" నటన్నను
నేమాత్ర మనుగ్రహింపకేచుచునుండెన్.

ఆ. "హనుమదాలయంబు ; హనుమదాలయ మిద్ది
మాతరిశ్వ ! కావుమా !" యటంచు
నబవఁ దొడఁగె మరియు మరియు నాతఁ డరణ్య
రుదితమయ్యె వాని గదితమెల్ల.

ఆ. ఇదియు నల్లై యగుట నదవదపడుచుండి
హనుమ రామభక్తుఁ డన్నమాట

స్మృతికిరాఁగఁ బలికె "నిద్ది రామాలయం
బయ్య ! కావవయ్య ! అనిలదేవ !

క. నీ కొమరుని యజమానుఁడు
గాకుత్స్థుఁడు; వాని యిల్లుగాచుట ధర్మ్యం
బో ? కాదో ? పోనిమ్మది
శ్రీకాంతుం డతఁడు; వాని కృపఁగొనఁ దగదే ?"

ఆ. మొత్తుకొన్ననిట్లు చిత్తగింపక పాక
నూచియూచి వేయుచుండె గాడ్పు
దానియాశవదలి "దయ్యంపుకొంప పో
ని"మ్మిదేల ? యంచు నెటకొ పఱచె.

## ౧౨. యోగసిద్ధుఁడు

ఆ. కలఁడు దాపసుండొకండు సంపాదించెఁ
గొన్నిసిద్ధు; లయ్యెఁ గురుఁడతండు
ఎల్లవేళలందు నిసుకవేసినరాల
కుండ వాని మూఁగియుంద్రు జనులు.

క. ఉపదేశించును మంత్రము;
జపించి తాయెతులుగట్టు; స్పర్శముచేతన్
వ్యపగతరోగులఁ జేయున;
యపూర్వములు యోగసిద్ధులని పొగడ జనుల్.

గీ. మున్ను కాపురమున్నట్టి పూరిగుడిసె
నేఁడు గసువిందు గావించు మాడువయ్యె
నాతని గృహాంగణమునందు నహరహంబు
ఛాత్రబృందంబు కనకవర్షంబు గురియు.

ఆ. వచ్చి చేరె జీతబత్తెముల్ లేని సే
వకకదంబకంబు; వచ్చిపడెను
గాన్క లివ్వియివ్వి కడు గుట్టగుట్టలై;
స్పృహ్యమయ్యె వాని సిరి కరంబు.

ఆ. ఆ పురంబునందుఁ గాపురంబొనరించు
నొక్క పూరిగుడిసె నువిదయొకతె
దాని మొలకనవులు దాని విలాసముల్
బాటసార్లకయ్యె బందములుగ.

ఆ. తమిని బావగార్లు దరిసింపఁ దొడఁగిరి
నేఁడు పూరిగుడిసె మాడువయ్యె
దాని తోఁటగల లతావృక్ష సంతతి
పసిఁడి పూలుఁ బసిఁడి పండ్లుఁ గాంచె.

ఆ. దాని మందిరంబు, దాని వైభవమును,
దానియింటి వస్తుతతియుఁ గాంచి
యందమైన రంభమందిరంబని యూరి
పూవుఁబోఁడు లెల్లఁ బొగడు చుండ్రు.

క. ఆ గురుని వైభవంబీ
భోగిని వైభవము చందమున వర్ధిలె; నీ
భోగిని వైభవ మవురా!
ఆ గురువైభవమువలె విహాయసమంటెన్.

## ౧౩. ఇంద్రుఁడు - బ్రాహ్మణుఁడు

క. పనసలు నారంగంబులు,
ననంటులును, నార్కేడంబు, లామ్రములు మొద
లొక్కని పెక్కు తెగల మొక్కలఁ
బెనుచుం దన తోఁటనాఁటి విప్రుఁ డొకఁడు మున్.

ఆ. ఎరువు దోలుచుండు; నేతాము వట్టును;
గావఁ బసులనుండి కంచెఁగట్టు;
మదివహించు ముదము మారాకు హత్తంగ
నాత్మకృషి ఫలించుననుచు నతఁడు.

గీ. కన్నెయగు ముద్దులాఁడినిగతినిఁ గనుచుఁ
దత్ఫలంబారగింపంగఁ దమకపడుచు
నాతఁడుండంగ మిత్తియ ట్లా వొకండు
వచ్చి క్రొమ్మావిమొలకను బట్టి మేసె.

గీ. పట్టరానట్టి కట్టల్క బ్రాహ్మణుండు
బడితగొని చచ్చునట్టులు బాదె దాని

నాయమునఁ దాఁక నఱచి 'యంబా !' యటంచు
విలవిలం దన్నుకొని డింకవేసె నదియు.

గీ. ప్రాఁకె నిప్పాపవార్త యా గ్రామమందు
నింగిని మెఱుంగు వితమున నిముసముననె
"శివ ! శివా !" యంచుఁ గొందఱు చెవులు మూయ
విప్రుఁ జీకొట్టిఁ గొందఱు బిట్టుఁ దిట్ట.

క. వెలిపెట్టిరి గోహత్యా
కలుషముఁ గావించినట్టి క్ష్మాసుర గ్రామ
స్థులు; నడువ రతని బాటను;
దలంగుదురు వానిగాలి దాఁకునొ ? యనుచున్.

క. "నను గోహత్యాపాతకి
నని యందురు మీరు; 'నేను నా నాత్మగదా !
వినరే ? యకర్త యాత్మం
బని పుణ్యముఁ బాప మంటవనియును దానిన్.'

గీ. సలిపె గోహత్య నాదు హస్తంబ; తదధి
దైవతం బింద్రుఁ డగుట నాతండె పాపి;
గాదు నే" నంచుఁ దద్దయు వాదులాడుఁ
బరమవేదాంతిమాని యా బ్రాహ్మణుండు.

ఆ. ఆలకించి దీని నమరనాథుండు వి
చ్చేసి బన్నిగట్టు వేసమ్మూని

తన్ను డాసి స్వాగతంబు నర్పించిన
యా వనాధిపతిని నడిగె నిట్లు.

గీ. "అయ్య ! ఈ తోఁట యెవరిది ? యెవరునాఁటి ?
రద్దిరా ! తీర్చిదిద్దిన యట్లు లుండె
నీ తరుశ్రేణు; లెవ్వరి చేతివాసి ?
మూఁడుపూ లాఱుకాయలై పొదలుచుండె."

గీ. తోఁట యజమానుఁ డిట్లు ప్రత్యుత్తరించె
"నార్య ! ఈ తోఁట నాదె; నా హస్తకౌశ
లంబ యిది యెల్లఁ; బ్రజ్ఞాబలంబుచేతఁ
జేసి దోహదములఁ బండఁ జేతు నిట్లు."

ఆ. అడిగె మరల నింద్రుఁ "డార్యా ! యిదెల్లఁద్వ
త్కర్తృకంబె నిజముగా ?" నటంచు
నాఁడె బదులు దోఁట యజమాని "యౌను మ
త్కర్తృకంబ" యని సగర్వముగను.

ఆ. అంత శక్రుఁ డిట్టులనె; "నోయి ! ఈ తోఁపు
వృద్ధికెల్లఁ గర్త వీవయేని
నెట్లు గోవధమున కేపాప మెఱుఁగని
యమరవిభుఁడు గర్త యగునొ ? చెపుమ !"

# ౧౪. శ్రద్ధ (౧)

ఆ. బాలుఁడొకఁడు గలఁడు; ప్రతిదినంబాతండు
బడికిఁబోవుచుండు నడవిదాఁటి
నీడదక్క లేరు తోడెవ్వరును; దల్లి
దక్క లేరు చుట్టపక్కములును.

ఆ. బిక్కుబిక్కుమనుచు బెదురుచూపులతోడఁ
బ్రాణములను బిగ్గఁబట్టినడచుఁ
జద్దిమూటతోడఁ జంక దప్త్రముతోడ
రేపు వెడలునిల్లు ; మాపువచ్చు

క. భయపడి మధ్యేఽధ్వమునుం
డియే బడికిఁబోకవచ్చు డింభకుఁగని వా
ని యుదంతమువిని జనయి
త్రి యొక్కనాఁడనియెఁ బ్రీతి రేకెత్త నిటుల్.

ఆ. "భయమదేల? తండ్రి! భయమువేసినవేళఁ
గృష్ణ! కృష్ణ! యనుచుఁ గేకవేయు"
మనుడు నాతఁ "డమ్మ! యాకృష్ణుఁ డెవఁ?" డనె
"నతఁడు నీకు నన్న" యనియెఁ దల్లి.

గీ. చిట్టడవినుండి చనుచున్న చిన్నవాఁడు
పులిపగిదివచ్చు నొక కుక్కపోతుఁగాంచి

మఱునటిదినాన భయసంభ్రమంబు లుబుక
"అన్న ! కృష్ణా" యటంచుఁ బల్లఱపులఱచె.

క. కనుచుండె నలువలంకులుఁ
జనుదెంచండయ్యె; మొఱుగసాఁగెఁ దఱిసి యా
శునకము; "కృష్ణా ! కృష్ణా !"
యని బిట్టేడ్చుచును మరల నాక్రోశించెన్.

ఆ. "ఓయి ! ఓయి ! వచ్చుచుంటినిఁ దమ్ముఁడా !
వలదు వలదు భయము; వచ్చుచుంటి"
నన్న మంజునాద మాకాశవాణినా
వినిచె మొదట శ్రవణపేయముగను.

క. మొలఁజుట్టి పట్టుదట్టినిఁ,
దల నెమిలితురాయిఁ, గేలఁదాలిచి మురళిన్
గిలకిల నవ్వుచుఁ బిమ్మటఁ
గెలనికిఁ బరువెత్తి బాలకృష్ణుఁడు వచ్చెన్.

ఆ. వచ్చి కేలు బుజముపైవైచి తట్టుచు
వెఱపుఁబాఁపి వాని వెంబడించి
యడవిదాఁటఁజేసి బడికిఁ బంపించెను
సుమధురోక్తులాడుచును నతండు

గీ. "తమ్ముఁడా ! ఎప్పుడెట్టి భయమ్ము నీకుఁ
గలిగినను నన్నుఁ బిలువుము ! తొలఁగఁజూతు"

నని యభయహస్తమిచ్చెఁ; బ్రత్యక్షమగును
దాదృశాతురజనులకు దైవతంబు.

## ౧౫. శ్రద్ధ (౨)

గీ. భాగవతసత్తముఁడొకండు బ్రాహ్మణుండు
అహరహంబు సహస్రనామార్చనంబు
సలిపి నీరాజనంబిచ్చి స్వగృహదైవ
మునకు నైవేద్యమొనరించు భోజ్యములను.

గీ. అతఁడు గార్యాంతరమున గ్రామాంతరమున
కరుగువాఁ డాత్మపుత్త్రిని కానతిచ్చె
"భగవదారాధన మొనర్చి భక్తి శ్రద్ధ
సలుపుము నివేదనంబు భోజ్యంబు" లనుచు.

క. పితృవచనముఁ దలఁదాలిచి
శ్రుతివచన సమానముగను సూనుఁడు గృహదై
వతమునకుఁజేసి పూజలు
నతులిడి ముందుంచి తళియ నైవేద్యమిడెన్.

ఆ. అతఁడు గాంచుచుండె నా విగ్రహము వంక
నారగింపవచ్చు నన్న కోర్కెఁ;
బెట్టినట్టు లుండెఁ బెట్టిన పళ్యంబు;
గదలకుండెఁ బ్రతిమ మెదలకుండె.

గీ. విగ్రహం బారగించు నైవేద్యమంచు
విశ్వసించి దృఢమ్ముగా వేచెఁ బెద్ద;
స్వాపచారంబొ ? తినకుంట కనుచు వగచుఁ;
గరముఁ గర్తవ్య మూఢుఁడై కాంచు దెసలు.

క. మరలన్, మరలన్, భగవ
చ్చరణంబుల నంటుఁ; బూజ సలుపును మరలన్
మరలన్; బఠించు స్తోత్రము
మరలన్ మరల న్నతండు మలఁగని బత్తిన్.

క. తనపూజ భస్మహోమము,
తన స్తోత్రము చెవిటివానిదరి గీతముగా
మనమున నైఁపక బాలుఁడు
గనులన్ నీరురలి కాల్వగట్టఁగ నేడ్చెన్.

ఆ. వచ్చి స్వామి యపుడు పద్మాసనస్థుఁడై
యా నివేద్యమెల్ల నారగించె;
భక్తవత్సలుండు భగవానుఁ డెందాఁకఁ
గానరాక యుండఁ గలఁడు దాఁగి ?

గీ. వట్టిపళ్లెంబుతో వచ్చువానిఁ గాంచి
"యిందుఁగల భోజ్య మేమయ్యె ?" నంచు నడిగె
గృహజనంబు; "భక్షించె విగ్రహ" మటంచు
బాలకుం డాడె నక్కజంపడఁగ వారు.

క. "మన తాతల, ముత్తాతల
దినంబు లందేని సిట్టి తీరెఱుఁగము; త్వ
జ్జననాంతర పుణ్యంబును
గొనియాడం గలమె ?" యనిరి కొందఱు పేర్మిన్.

## ౧౬. మల్లయుగ్మము

క. హనుమాన్‌సింగను మల్లుం
డును, నొక్క తురుష్కమల్లుఁడుఁ బ్రతిస్పర్ధం
గొని మల్లయుద్ధ మాడం
గను బందెము సఱచి దినముకై వేచిరొగిన్.

క. పెనుకాటెనుపోతునకౌ
నెన యాపంజాబు మల్లుఁ; డినుమే మేయున్
అనుదినమాతఁడు ; కావున
నినుంప భీముండటంచు రెల్లరు జనముల్.

ఆ. పందియంపు దినము పక్షమున్న దనంగఁ
గోడిగ్రుడ్లుఁ గడిఁది గొడ్డుమాంస
మతఁడు దినఁ దొడంగె నా బకాసురుఁ డట్లు
చేవదేలె నొడలు గావరించి.

ఆ. పిండిఁ గొట్టె నెంచుఁ గొండల బండలఁ ;
బెద్దపెద్ద తరులఁ బెఱుకఁ గడఁగు

సింగములఁ దలంచుఁ జెవులువట్టాడింప
ముసలిమానుమల్లముఖ్యుఁ డపుడు.

ఆ. అతనిఁ గన్నవార లతనిదే పైచెయ్యి
తప్పదంచు మదినిఁ దలఁచుకొంద్రు
చంపి పుట్టె వీఁడు చాణూర ముష్టిక
మల్ల యుగమునంచు మరియునంద్రు.

క. హనుమాన్‌సింగ్ మల్లబ్రువుఁ
డనఁ దగి నట్లుండెఁ ; దిను మితాహారమె ; యుం
డును బక్కచిక్కి ; నిచ్చలు
హనుమన్మంత్రము జపించు నతిభక్తిమెయిన్.

ఆ. పందియంబునాఁ డుపవసించి యాసింగు
ఆంజనేయపూజ లాచరించి
పప్పుపానకములు పరగ నివేదించి
యా ప్రసాదలవమె యారగించె.

క. ఎదిరిని సింగును గనుఁగొని
పదుగురు "సింగమును లేడిపైకొనుట గదా !
యిది" యంచుఁ బరిహసించిరి
పెదవి విఱిచి "సింగు వట్టి పీఱఁడి" యనుచున్.

క. పెనఁగం బూనిరి యిరువురు ;
హనుమాన్‌సిం గొడలు పెఱుగ నాత్రుటి నెల్ల

ర్కనుచుండ సింగమే య
య్యెను ; హరిణంబయ్యె వాని యెదిరియు నకటా !

ఆ. మొగిలు విచ్చినట్లు మొగి మహాబలుధాటి
హనుమసింగుఢాక కాఁగ రాక
కరిగిపోవ మేనికండలు డీల్వడి
చప్పఁబడియెఁ గాళ్ళుసాఁచి యెదిరి.

## ౧౭. దృఢవిశ్వాసము

ఆ. మును విభీషణుండు వనధి నుల్లంఘింపఁ
జాల కెడఁద వగచు జనునిఁ గాంచి
యొక్క తాటియాకు ముక్కపై నెదొ వ్రాసి
యంటఁగట్టెఁ దత్పటాంచలమున.

గీ. పలికె "నేతత్ప్రభావంబువలన నీవు
నడచి పోఁజాలుదువు సుమ్ము ! కడలిపైని ;
వలదు భయము ; విశ్వాసంబు వదలఁబోకు ;
మట్లు గాకున్న మునిఁగెద వబ్ధి" నంచు.

గీ. అద్భుతము నొందు చాతఁడా యర్ణవమునఁ
బుడమిపయిఁ బోలెఁ గాల్నడఁ బోవుచుండెఁ ;
గొలఁది దవ్వేగ వానికిఁ గోర్కపుట్టెఁ
దాటియాకున నున్న మంత్రము నెఱుంగ.

ఆ. అందు 'రామ' యన్న యక్కరంబులు రెండు
చదివి "యరరె! దీన నెదియొ దివ్య
మంత్ర మున్నదనుచు మదిని భ్రమించితి
నిది యొకో?" యటంచుఁ బెదవి విఱిచె.

గీ. అతఁడు విశ్వాస మఱఁగాఱ నా క్షణంబ
పాప మయ్యయ్యొ! యమ్మహోవారిరాశి
మునిఁగి యనుతాపమును బొందుకొనుచు విడిచెఁ
బ్రాణములు జాలిపడఁగఁ జూపఱు కడింది.

## ౧౮. పార్థగర్వభంగము

క. తనకన్న భక్తతరుఁడును,
దనకన్నను లేఁడు మిత్రతరుఁడును నారా
యణునికి నని ఫల్గునుమది
ఘనీభవించె న్నఖర్వగర్వ మొకతఱిన్.

ఆ. సకలహృదయగతుఁడు సర్వజ్ఞుఁడగు కృష్ణుఁ
డీ రహస్య మేల యెఱుఁగకుండుఁ?
బార్థుఁ డనుసరింప వాహ్యాళికై యాతఁ
డరిగె నొక్కతూరి యలఁతి దవ్వు.

క. కనఁబడె వారికి నొక బ్రా
హ్మణుఁ; డాతం డెండుకసవె యాహారముగాఁ

గొనువాఁడు; వాని కెలనం
దనరును ఖడ్గము పరున్న త్రాఁచువితమునన్.

ఆ. పచ్చిగడ్డిఁ దిన్న ప్రాణిహింస యటంచుఁ
దినును సతము శుష్కతృణమె యతఁడు ;
కాని కలదు ప్రక్కఁగత్తి యొక్కఁడు "శర
ణార్థి చంకదుడ్డు" నన్న పగిది.

గీ. విప్రుని చరిత్ర మతనికి వింతగొలుప
హరినిఁ బృచ్ఛించె; నాతండు "నడిగి తెలియు
మమ్మహీదేవునే" యనె; నన్నరుండు
ప్రశ్నవేసెను; బాఱుండు వలికె నిట్లు.

ఆ. "సందు దొరకెనేనిఁ జంపం దలంచితి
నలువురను; శతుండు నారదుండు
అందుఁ బ్రథముఁ; డతని యపరాధ మేమందు
వేని నాలకింపు మెల్లదియును.

క. కనుమాతని సాహసమును
ననుక్షణము నాదుస్వామి హరినిజ గానం
బున ముంచితేల్చుఁ ; బూనఁడు
గనికరమును వేళపాళఁ గాంచఁడు మరియుజ.

గీ. 'ఎవరు రెండవవా'రందువేమొ ! వినుము !
తెలివిమాలిన ద్రౌపది ; పిలిచె నాదు

స్వామి; సిద్ధాన్నముఁ ద్యజించి పఱచె నతఁడు
పాండవులను దుర్వాసు శాపమునఁ గావ.

గీ. ఇంతతో నూరకుండినఁ గొంత మెఱుఁగె;
అట్టుగాకామె యెంగిలిపెట్టెఁ దినఁగ
నాదు స్వామికిఁ; దానిచ్చినది గ్రహించు
మానక సమస్తమన్న ధీమా వహించి.

గీ. 'అడుగు మూఁడవదెవ?' రని యతఁడు గ్రూర
తముఁడు ప్రహ్లాదుఁ; డకట! మత్స్వామి నడుగు
దూఁకఁగాఁ దత్తతైలంపు ద్రోణి, నేన్గు
పాదముల నల్గ; రాతికంబమునుజీల్చ

క. 'ఎవరు తురీయుం?' డని యడు
గవేమి? యతితుచ్ఛుఁ డమితగర్విష్ఠుఁడు పాం
డవమధ్యముఁ; డతఁడొకపరి
నవురా? మత్స్వామి స్వరథయంతగఁజేసెన్."

ఆ. పలుకనిట్లు మాడెఁ బార్థుని నెమ్మోము:
కాటుపోయెఁ దొంటి గర్వరేఖ
'బ్రాహ్మణుండు పరమ భాగవతోత్తముఁ'
డని తలంచుకొనియె మనమునందు.

## ౧౯. పణబంధము

మ్మయగు పార్వతీదేవి యంతికమునఁ
మరులైన పిళ్లారియుఁ గొమరుసామి
టలాడుచు నాడుచు నడిగి రిడఁగఁ
ళంబున వ్రేలు ముత్యాలపేరు.

ల్లి వలికె "భూప్రదక్షిణం బొనరించి
వరు ముందువత్తు రిత్తు వారి"
డుఁ గార్తికేయుఁ డారూఢుఁడై మయూ
సనమున వెడలె నా క్షణంబ.

జముఖుండు మెల్లఁగా లేచి యాదేవి
ప్రదక్షిణించి యెదిటి కేగి
కఁకజిల్లఁ గాంచి ముదమొంది తనదు ము
్యలసరముఁ దీసి యతని కొసఁగె.

ద్దతడవు పిదప విచ్చేసి సురువులు
క్కుకొనుచు భ్రాతృగళమునందు
రముఁ గాంచి యడిగె "జనని ! లంబోదరుం
ట్టు లెలుకనెక్కి చుట్టి వచ్చె ?"

నవుడు గజాననుం డనె
జననీగర్భమున సర్వజగములు వెలుఁగన్
ననీప్రదక్షిణము చే
న తీఱదె మనకు భూప్రదక్షిణ కృతియున్."

## ౨౦. ఈశ్వరేచ్ఛ

క. కలఁడొకఁడు తంతువాయుం
డలోకసామాన్యపుణ్యుఁ, డనఘుఁ డతఁడు ; లో
కులు మెత్త్రు ; విశ్వసింతురు
గలుషంబు నశించు వానిఁ గన్న నటంచున్.

గీ. వలువలను నేసి కొంపోయి పణ్యవీథి
దాని మూల్యంబుఁ దెలుపుఁ గ్రేతలకు నిట్టు ;
"ఈశ్వరేచ్ఛనుబట్టి నూ లేకరూప్య ;
మెనిమిది యణాలు నాకూలి యీశ్వరేచ్ఛ".

క. ఇమ్మడి ముమ్మడియగు మూ
ల్యమ్మున కమ్మెడు వణిక్చయముఁ దఱియక న్యా
య్యమ్మీతని వెలలంచును
సమ్మతిపడి విలుచుకొండ్రు జనులతనికడన్.

క. తులఁ దూఁచినట్లు శ్రమకును
ఫలంబుఁ గాంక్షించుఁ ; గొనఁడు పైనేనియు మి
క్కిలి ; శ్రమయును దా సలుపఁడు
బలువుగఁ ; గాలమునుబుచ్చు భగవత్సేవన్.

గీ. ప్రత్యహంబును నర్ధరాత్రంబుదాఁక
భజనసేయును బాటలు బాడుకొనుచు ;
జపమొనర్చును ధ్యానంబు సలుపుకొనుచు ;
స్వాపమును బొందు నాపారవశ్యమందె.

క. ఒకనాఁటి నిశీథంబున
స్వకార్యముల నెల్లఁదీర్చి సాలె నిదురప
ట్టక గుడికడఁ గూర్చుండఁగ
నొక దొంగలగుంపు పోవుచుండె నెదురుగాఁ.

ఆ. ముషితవస్తురాశి మోయఁజాలక వార
లుంచి వానినెత్తి నొక్కమూటఁ
"దోడర"మ్మటంచుఁ దోడ్కొని పోయిరి;
అరిగె "నీశ్వరేచ్ఛ" యనుచు నతఁడు.

ఆ. సందుమలపుదిరిగి చనుచుండ నొకచోటఁ
గానిపించె రక్షకవ్రజంబు ;
పులులఁగన్న లేళ్ళవలెను దొంగలమితా
పిక్కబలము సూపె దిక్కులకును.

గీ. అపహృతద్రవ్యమును మోచునట్టివాని
నా కువిందునిఁ దలఁచి దొంగంచుఁ బాప
మా తలారులు సంకెలల్ చేతులకిడి
ప్రాడ్వివాకుని మ్రోలకుఁ పంపిరంత.

క. విని యయ్యనఘునిఁ గూఱిచి
చని న్యాయస్థానమునకు జనులెల్లరు నా
తని పుణ్యశ్లోకత్వము
వినిచిరి యధికరణికునకు వేనోళులతోన్.

ఆ. పిలిచి నేఁతకాని "విడువక తూచాలు
జరిగినట్టి గాథ నెఱుకపఱుపు"
మనఁగ నధికృతుండు, ప్రాంజలియై నిల్చి
పలుకఁగడఁగె నిట్లు వాయపుండు.

గీ. "దేవరా! ఈశ్వరేచ్ఛ రాతిరి భుజించి
యేఁగి దేవళమున కీశ్వరేచ్ఛ, భజన
సలిపి కొండొక యీశ్వరేచ్ఛను బరుంటి
నేలొకో? నిద్రరాదయ్యె నీశ్వరేచ్ఛ.

గీ. గుడిబయట నీశ్వరేచ్ఛను గూరుచుంటి;
నేఁగుచుండె నా ముందుండి యీశ్వరేచ్ఛ
బందిపో; టదినానెత్తిపైని మూట
నెత్తి "వెంటర"మ్మనఁ బోతి నీశ్వరేచ్ఛ.

ఆ. ఈశ్వరేచ్ఛ రక్షిబృందంబు నడిబాట
కానరాఁగ వాండ్రు కాలుదూసి
రీశ్వరేచ్ఛచేత నేఁ జిక్కితిని యామి
కులకు నీశ్వరేచ్ఛఁ గొట్టఁబడితి.

ఆ. ఈశ్వరేచ్ఛఁ దెచ్చిరిటకు నన్నిత్తఱి;
నేమి జరుగఁగలదొ యీశ్వరేచ్ఛ;"
నని వచింప సర్వమాలించి యధికారి
విడిచె నిరపరాధి వీఁడటంచు.

ఆ. "ఈశ్వరేచ్ఛఁ దొల్లి యేబంధితుఁడనైతి
నిపుడు ముక్తిఁగంటి నీశ్వరేచ్ఛ
నీశ్వరేచ్ఛ వెలిగ నేదియు జరుగ" ద
టంచు గ్రామజనుల కతఁడు గఱచె.

## ౨౧. అగ్బరు - యాచకుఁడు

క. 'అల్లా' భక్తుం డగ్బరు
ఢిల్లీపుర మేలుతఱిఁ గుటీచకుఁడొకఁడా
ఢిల్లీపరిసరమునఁగల
పల్లియ నివసించె సత్తపశ్చర్యుండై.

క. దరిసించి యమ్మహాత్ముని
కఱపులకుం గడుపునిండఁగాఁ ద్రేన్చుచుఁబో
దురు శిష్యబృంద ; మతనికి
విరామమనుమాట గానిపింపదలఁతియుఁ.

క. ఒక పుణ్యాహంబున శి
ష్యకాండమున కభిలషించి యాతిథ్యమిడ
ఒకపరి యాతఁడు ధనయా
చకుఁడై యా మొగలుపాదుషాకడ కరిగెఁ.

గీ. అతని ప్రాసాద రాజమధ్యంబునందుఁ
బొలుచు ప్రార్థనామందిరంబునకు నరిగి

యోగులుఁ, ఒకీర్లు, జడదారు లున్నయచట
నొదిగొదిగి యొక్కమూలఁ గూర్చుండెనపుడు.

క. భగవత్స్తోత్రం బొనరిచి
'యగబర్' తుదియందుఁజేసెఁ బ్రార్థనమిట్టుల్
"భగవానుఁడ ! దయసేయవె ?
తగఁ దఱగనిసిరులు సంపదలునున్ నాకున్."

క. విని పాషాభ్యర్థనమును
ముని యచ్చటువిడిచి వెడలఁబోవఁగఁజేస
న్ననుజేసి యాఁపి తన ప్రా
ర్థనాంతమున డాయఁబిలిచి ప్రభు విట్లడిగెన్.

ఆ. "దొలనుండి పెక్కుఁదాటిగ వంకుల
నిటకువచ్చి మగిడి యేగుదేల ?
కార్య మెఱుకపఱపకయ; యోయి ! పుల్లయ్య
వేమవరము వచ్చి వెడలినట్లు."

క. అనవుడు బదులాడెను యమి
"జనవర ! నినుఁ గ్లేశపఱప సంకోచింతున్;
నను వెడలనిమ్ము ! వేగమె"
యన నిర్బంధించె నగ్బరతనినిఁ దెలుపన్.

క. యతి "యోయి ! సార్వభౌమా !
యతిథుల నర్చింప నర్థ మర్థింపఁగ వ

చ్చితి" ననెఁబతి "ముంతను దాఁ
చితేల? మజ్జిగకువచ్చి చెప్పక తపసీ!"

గీ. అనుడు జటి "నవాబ! యాచింతు వీశ్వరుఁ
జక్రవర్తి వయ్యు సంపదలకు;
యాచకుఁడవు నిన్ను యాచింపనేల? యీ
శ్వరునె నేను యాచ్ఞసలుపుదు" ననె.

## ౨౨. గోవిందదర్శనము

గీ. పతిమొగం బేనెఱుంగని బాల్యమందె
పతివియోగంబుఁ గొన్నట్టి బాలికొకతె
కాంచి పరబాలికాభర్తృకథలు పాప!
మడిగె "నాభర్త యేఁడి?" యటంచుఁ బితను.

క. అతఁ డాలకించి యెంతయు
వెతగొని చిత్తమునఁ బలికె "బిడ్డా! విను! నీ
పతి గోవిందుఁడు; పిలిచిన
నతండు సనుదెంచు నీదు నంతికమునకుఁ".

గీ. అనుడు హృష్టాంతరంగయై యాకుమారి
తన గృహాభ్యంతరముఁ జొచ్చి తలుపుమూసి
పిలిచె "రమ్మ! గోవింద! గోవింద!" యనుచు
నంజలిపుటంబు ఘటియించి యాదలపయి.

ఆ. రామి మరలమరల రాల్పడఁగా నెగ్గు
పిలిచె ; నశ్రులురలఁ బెద్ద యేడ్చె ;
గోచరించె నంత గోవిందుఁ డెదుట ; నెం
దాఁక సదయుఁ డతఁడు దాఁగియుండు ?

## ౨౩. సాక్షాత్కారము

క. భగవత్సాక్షాత్కృతి యె
ట్లగునో దయచేసి దేవరా ! తెలుపుఁడటం
చొగి శిష్యుఁడు ప్రశ్నించెను
స్వగురుని వేదాంతశాస్త్రపాఠమువేళన్.

క. 'తెలుపుదు నాతోర' మ్మని
పలుకంగా గురువువెంటఁబడె ఛాత్రుఁడు ; వా
రలు మెల్లనడిచి డాసిరి
కొలంది దవ్వులఁగలట్టి కొలనొకదానిన్.

క. మొలబంటి నీటిలోపల
నిలిచి గురుఁడు శిష్యుఁబట్టి నీటను ముంచెన్
దలయెత్తనీక తనచే
తులతో నిర్దయునిరీతిఁ దోడ్తో నదిమెన్.

ఆ. విడిచిపుచ్చె నలఁతి తడవుంచి యట్టులు
గురుఁడు; శిష్యుఁ డెత్తి శిరసు నిలిచె;

అడిగె "నీటమునిఁగి నప్పు డేచందాన
నుండెనోయి ! నీదు నునికి ?" యనుచు.

ఆ. "ఉడ్డుగుడుచుకొంటి నుక్కిరిబిక్కిరై
బైటఁబడఁగఁ నాత్రపడితిఁగడిఁది
జచ్చిపోవుచున్న సరవిదోఁచెను నాకు"
నంచు గురుని కాతఁ డాడె బదులు.

క. "భగవత్సాక్షాత్కారం
బగుఁబో ! తద్దర్శనమున కాత్మను క్షోభి
ల్లఁగ నీకీ చందంబునఁ
బగలును రేయియు ; నిదే తపంబగుఁ జుమ్మీ !"

క. అని పలుకఁగ నాచార్యుఁడు
విని శిష్యుండంతఁ గట్టిపెట్టి చదువులన్
అనవరతతపశ్చర్యను
గొనె నపరోక్షానుభూతిఁ గొలఁదితడవులన్.

## ౨౪. దృఢ వైరాగ్యము

గీ. భుజముపైఁ దుండుగుడ్డను బొందుపఱచి
స్నానమాడంగఁ జనుచు నసాంప్రతముగ
మరులుగొని పైకొనఁగవచ్చు మగనితోడఁ
బొలఁతి నెమ్మోముఁదమ్మిని ముడిఁచి పలికె.

గీ. "వేయుచున్నది నీబుద్ధి వెఱ్ఱితలలు;
వార్ధకమువచ్చి తద్దఁ బైఁబడినకొద్దిఁ;
తాళఁజాలవు క్షణము నన్ దాఁకకుండ
నీవిమోక్షంబె మోక్షంబు నీకుఁ దలఁప.

క. కనుమతఁడు దనపదార్వుర
ననఁబోఁడుల నొక్కొకరి దినక్రమమున మా
సిన వలువలవలె వీడెడు;
వెనుదిరిగియు వారిపైపు వీక్షింపఁడుగా!

క. అతఁ డెంత విరక్తుండో!
శతజన్మలకేనిఁ దాదృశము వైరాగ్య
స్థితి నీ కొదవునె?" యనవుడుఁ
బతియనెఁ "జింత్యంబు నీవు వాకొనిన దిసీ!

ఆ. పడఁతి! సుదృఢమైన వైరాగ్యసంపత్తి
గలుగువాఁడతండు గాఁడు! కాఁడు!
వదలఁజాలఁ డతఁడు పదునార్వురాంగ్రను
దినదినక్రమంబు ననుసరించి

క. వెలఁదీ! దృఢవైరాగ్యము
గలవాఁడు క్రమేణకాక కల తనయిలువాఁ
కిలియును, బెండ్లము, బిడ్డల
మలమునువలె విడుచునొక్క మారే త్రుటిలోన."

ఆ. అనుడు వాని నెలఁత "అయినను నీకన్న
నతఁడు మేలుగాదె? శతవిధములఁ
గేవలాంధుకన్న క్షితిని రాత్ర్యంధుండు
మేలుగాదె?" యనుచు మేలమాడె.

క. పెనిమిటియనె "సుదతీ! యీ
జనుఁడు పదార్వురఁ ద్యజింపఁజాలఁడు; నేనీ
క్షణమునఁ ద్యజింపఁజాలుదు"
నను చా పైగుడ్డతో గృహంబుఁ ద్యజించెన్.

## ౨౫. స్నేహపరీక్ష

క. "అగు బ్రహ్మ మొకటె సత్యము;
జగంబు మిథ్యయ; నశించు సకలము దృశ్యం;
బిఁగ నాతోఁ జనుదేరము;
భగవత్సాయుజ్య మోయి! ప్రాపింతువు సూ!"

క. అని యుపదేశింపఁగ గురు,
వనె శిష్యుం "డార్య! నాకు నాలుంబిడ్డల్
జననీజనకులు గల; రా
జనంబు నాకోసమిడు నిజప్రాణంబుల్.

గీ. స్నేహపాశంబుచేత బంధింపనన్ను
నెట్లు వదలించుకొని స్వామి! యేగుదెంతు?"

నన, గురుం "దేను; నాదిది;" యన్నతలఁపు
గలవఱకు నెంచుదువు వారు వలతురనుచు.

ఆ. వట్టిమిథ్యసుమ్మ! వారు నిం(బేమింతు
రన్న; నీకొఱకయి ప్రాణములను
విడుతురన్న నదియుఁ బెద్ద వి(భాంతిపో!
అనుభవమునఁగాని యది తెలియవు.

గీ. ఇదిగో! ప్రత్యక్షపఱచెద నిపుడె చూడు
మీ గుటికమింగుమీ! పోయి యింటి కీవు;
మృతునివలెఁ గానిపింతువు మృతినిఁగొనవు;
వినుదు వీనుల నెల్లయుఁ; గనుదు కనుల.

క. అరుదెంచెద నీకడక
త్తఱి మరలంగూర్తు స్వస్థతను నీ" కనుడుం
గరములు మోడిచి ఛాత్రుం
దరిగి గృహము మందుఁద్రావి యవనిం గూలెన్.

గీ. గొల్లుమని రొక్కుమారి యింటిల్లిపాది
తల్లిదండ్రులు దారపుత్త్రికులు నపుడు;
"లబలబ" యటంచు నెత్తినోళ్ళను గడింది
బాఁదుకొంచును నేలపైఁబడిరి కట్ట!

క. "పితరులకు నేకపుత్త్రికుఁ;
డతండు ప్రాయమునఁ బిన్న; యధిగతవిద్యుం;

దతిలోక చరిత్రుం; డని
ప్రతివేశిజనంబు జాలివడెఁగని వానిఁ.

ఆ. తండ్రిఁ గడచి తల్లి, తల్లినిం గడచి క
ళత్ర మెంతయేఁ గలంగి యెడఁద
నతఁడులేని మాదుబ్రతుకేటి ? కనుచుఁ గొం
తెత్తి షడ్జమునకు నేడ్చుచున్న,

ఆ. బ్రాహ్మణుం డొకండు వచ్చి యచ్చటికిఁ ద
దార్తికారణంబు నరసి తెలిసి
వాని నాడిఁబట్టి పరికించి యనె "వీఁడు
మృతుఁడ ; కాని మరల బ్రతుకఁగలఁడు.

గీ. కలదు దివ్యౌషధంబు నాకడ నొకండు ;
దానఁ బ్రుటిలేచి తిరుగు నీతం" డనంగ
నేడ్పు సాలించి యెల్లరు నెలమిఁగొనిరి
అతఁడు దమపాలి దైవంబయనుచు మ్రొక్కి.

ఆ. మరలఁ బలికె నిట్లు క్ష్మాసురుం "డీమందు
మ్రింగవలయు నెవ్వరేనిఁ బరులు ;
మందుఁ దిన్నవాఁడు మరణించు ; నీతండు
బ్రతికి లేచు నుత్తరక్షణంబ.

క. కల రిచ్చటఁ దలిదండ్రులుఁ,
గళత్ర మత్యాప్తు లితనికై మిక్కిలియుఁ

విలపించువార ; లీతఁడు
వెలియగు బ్రదుకేల ?" యని తపించెడువారు౯.

ఆ. జనకుఁ డంతఁ బలికె "స్వామి ! నే సిద్ధమే
పుత్రుకొఱకుఁ బ్రాణములఁ ద్యజింపఁ ;
గాని యొక్కచిక్కు గలదు ; నే లేకున్న
నడవ దింట నొక్కనాఁడు బండి.

ఆ. ఎచట నేమి గలదొ ? యెవ్వ రే మీయంగ
వలెనొ ? వీరి కెఱుకవడదు లవము;
కాలఁదన్ని యిట్టి గంపంత సంసార
మేఁగ నేను వీరి కెవరు దిక్కు ?"

ఆ. అనుడుఁ దల్లి యిట్టులనెఁ "త్రిశుద్ధిగ నెంతు
సుతునికొఱకు నేను మృతినిఁ బొందఁ;
గాని నాదుబిడ్డ కడుపుతో నున్నది;
ఎవరు పురుడుపోతు రేను దక్క ?"

ఆ. అంతఁబలికె భార్య "ఆర్య ! నేఁ జత్తుఁబో !
ఇతఁడు పెండ్లియాడు నింతి నొకతె ;
నెవరు సాఁకువార లీ పసికూనల ?
నకట ! కనులు దెఱవనట్టివారి".

గీ. చచ్చెనని యందఱనుకొన్న ఛాత్రుఁ డెల్ల
కతల నాలించి యాకస్మికముగ లేచి

యంజలి ఘటించి "స్వామి ! మిమ్మనుసరింతు;
విరిసె నా భ్రాంతి" యని వ్రాలెఁ జరణములను.

## ౨౬. ప్రేమపరీక్ష

క. తను సన్న్యసింపుమనుచు
న్ననయం బుపదేశమిచ్చు నాచార్యునితో
ననె శిష్యుఁడు "గాఢముగా
ననువలచిన సతిని విడువ న్యాయమె ? స్వామీ !

ఆ. నేను దినక తినదు; నేను ద్రావక త్రావ;
దిడక నాకుఁ గొనదు తోడుగుఁ దోడుగ;
నాదు చిత్ర మర్చనము సేయు దేవతా
విగ్రహంబు ప్రక్కఁబెట్టి సతము.

క. ఇలువెడలిరామి వేళకు
వెలంది మ్రొక్కుకొను వేయివేల్పుల; నా దా
రులు సూచు నిలిచి వాఁకిట;
నల యాతాయాతజనము నడుగును జాడన్.

క. నే మృతి నొందినచో నా
కోమలి యనుమరణ మొందఁ గొంకదు; మనినన్
నా మృతకాయముఁ గాల్పఁగఁ
దామది సహియింపఁబోదు; తలఁచును గొలువన్."

ఆ. అనుడు మిన్నకుండి యతనికి హఠయోగ
శిక్షణంబు గురుఁడు సేయఁ దొడఁగె
నాసనములు గొన్ని యభ్యసించెను శిష్యుఁ
డయ్యెఁ బో! క్రమేణ యందు దిట్ట.

గీ. ఆతఁడొకదినమున ధనురాసనమున
నిశ్చలశరీరుఁడై శ్వాసనిలిపియుండెఁ
బెద్దకాలంబు; కని భార్య పెదవివిఱిచి
మృతుఁడని తలంచి తద్దయు నేడ్వఁదొడఁగె.

క. తలమోఁదుకొనును; గడు గుం
డెలు బాదుకొనును; భ్రుకుటిముడిఁచి విలపించున్;
ఎలుఁగెత్తి "అయ్యయో!" యను
చిలపయిఁబడు; లేచుఁ; దూలు; నెంతయుమూల్గున్.

గీ. "జీవనది యనుకొంటి నా జీవితంబు;
ఎఱుఁగ నింతలో నగును గొడ్డేఱటంచుఁ;
దానొకటితల్ప దైవంబు దలఁచు నన్య
మన్న లోకోక్తి నాయంద యన్వయించె.

ఆ. పెండ్లినాఁడు నాకుఁ బెద్దముత్తైదువ
లిడ్డ దీవనముల కిదిఫలంబె?
అకట! యెట్టిపాప మాచరించితినొ? నన్
జిన్నచూపుఁ జూచెఁ జీ! హతవిధి!

ఆ. తల్లిలేదు నాకుఁ; దండ్రిలేఁడు; మగండు
లేఁడు; సోదరులును లేరు కట్ట!
దిక్కుమాలినట్టి పక్కిఁజేసెను దైవ
మింత నిర్ఘృణుఁడుగ నెఱుఁగనైతి.

క. నినుఁబూజించిన వెనుకనె
పొనరింతును నాథ! దైవమునకుం బూజల్;
కినుకంబూనెనొ నాపై
ననాథఁగావించి దుస్సహార్తిం గూర్చెన్.

క. నీపాద చ్ఛాయలఁబడి
ప్రాపింతును స్వర్గమన్న హా! నా మెడకున్
ఈ పసిపాపలఁ జుట్టితి
వేపగిదిని జీవితేశ! యెగురఁగల నిఁకన్?"

ఆ. అనుచు నేకధారగను గంటికిని మంటి
కాలు మగనిఁగూర్చి రోలుచుండ
నిరుగుపొరుగువారు పరువెత్తి యేతెంచి
యాప్రమీతుఁగాంచి యనిరి యిట్లు.

గీ. "అయ్యొ! కాఁగలవాఁడు; ప్రాయంపువాఁడు;
దృఢతనుఁడు; బుజ్జినం జీఁది యెఱుఁగఁడెపుడు;
ఇట్టివాఁడు హఠాత్తుగా నేల మడిసె?
నక్కటా! వానలేకెట్లు పడెనొ? పిడుగు.

ఆ. ఏడ్చియేడ్చి పాపమెట్టిమన్నగుచుండ
నాపడంతియాప్తు లాశవంబు
బయటఁజేర్పఁ బూనఁ బట్టదయ్యెను ద్వార ;
మొడలు వంపుదిరిగియుంటఁ జేసి.

గీ. వారు మార్గాంతరములేమి ద్వారబంధ
విదళన మొనర్ప గొడ్డలిపెట్లుపెట్ట
నాతి యాలించి చాలించి యేడ్పు వచ్చి
వడివడి "నిదేమి" టని ప్రశ్నవైచి యెఱిఁగె.

గీ. "వలదు ! వలదండి ! ఛేదింప ద్వారబంధ ;
మిల్లు కుక్కలదొడ్డియా నింకమీఁద ;
నీ సిసులతోడ నివసించు టెట్టు లిందు ?
దీని మర్మతు నేయించు దేవుఁ డెవఁడు ?

గీ. ప్రాణమున్నంతవఱ కెట్లొ ! బ్రదుకవలయు ;
నెవరు చత్తురు మృతునితో నెల్ల వదలి ?
కాన ఖండించి యాతని కరపదములు
వెలికిఁ గొంపొం"డటంచును బలికె మెల్ల.

గీ. అద్ది యాలించి హఠయోగి యాసనంబు
సడలిచి నిజాంగకంబులు సాఁచి లేచి
"ఓసి ! నా కాలు నేతులు గోసివేయఁ
దలఁచితే ?" యంచుఁ గట్టల్కఁ బలికి యంత.

క. ఇల్లును వాఁకిలి వీడ్కొని
పిల్లలఁ జెల్లలఁ ద్యజించి వెస గురు కడకున్
వెళ్ళి ప్రణమిల్లి జరిగిన
దెల్లయు వినిపించి సన్న్యసించెను దుదికిన్.

## ౨౭. కర్మయోగి

ఆ. కాఁపువాఁ డొకండు గలఁడొక్క పల్లెలో
పలఁ; గుటుంబికుండు వాఁ; డటయ్య
నంటనట్టులుండు నబ్జాతపత్త్రస్థ
వారిబిందువట్లనారతంబు.

క. పండినఁ బొంగఁడు; పొగులం
డెండినఁ దనచేను; తనదు కృషి లోపము సే
యండు; స్థితప్రజ్ఞుం డీ
తం డనఁగా జీవయాత్ర తగ సాఁగించున్.

క. అతనికిఁ జిరకాలమునకు
సుతుండు జనియించె; వాని సుదతీమణి దు
ర్గతునికిఁ బెన్నిధి దొరకిన
గతి, నొక యెదుగెదిగినట్లుఁ గరమలరె నెదన్.

ఆ. అతఁడు మొగముతోడ నా పుత్త్రు ముద్దాడుఁ;
జిచ్చికొట్టి నిద్రపుచ్చుఁ జేత;

బుజముమీఁదికెత్తి మోయు; లాలించు; ని
ర్మగ్నమానసుండుమాత్రగాఁడు.

ఆ. హద్దులేని పుత్రు ముద్దుముచ్చట్లతోఁ
బ్రొద్దు సాలకుండెఁ జో! పొలంతి
కంటుకొనెనొ? బాలుఁడా తల్లి చేతుల
కంచు నిరుగుపొరుగులమ్మ లనిరి.

ఆ. ఎన్నిసార్లు ముద్దుగొన్నను, దా నెన్ని
తూరు లెత్తుకొన్నఁ, దొడుగుచున్నఁ
దొడుగు లెన్నిమార్లు, వడయదు సంతృప్తి
గొఱఁతలున్న యటులె గరిత దలఁచు.

క. సుతుఁ డేపొలముం బుట్రయు;
సుతుఁడే యిలువాఁకిలియును; జుట్టము సుతుఁడే;
సుతుఁడే దైవము పడఁతికిఁ;
పతికన్నను సుతుఁడె ప్రేమపాత్రం బయ్యెన్.

క. పతి యెంతటి నిర్లిప్తుఁడొ
సతియంత నిమగ్నురాలు సంసారమునన్
సుతుఁ డొగి దగ్గినఁ దుమ్మిన
మతిచెడి త్రాగించు మందుమ్రాఁకు లెవేవో!

క. పొలమును దునుచుండఁ గృషీ
వలుఁ డొకపరి యొకఁడు వచ్చి పరుగుపరుగునన్

దెలిపెను "నీ పసిపాపకుఁ
'గలరా' వచ్చినది; రమ్ము గ్రక్కున" ననియెన్.

క. కలఁగం బాఱని మదితోఁ
గళదప్పని మోముతోడఁ గర్షకుఁ డేగెన్
బిలిచెను ధన్వంతరినే;
ఇల దుర్విధి నేయు నమృత మేని విషముగన్.

గీ. గొల్లుమని రొక్క మొగిని నింటిల్లి పాది
తల్లి కంటికిమంటికి ధారగట్ట
నేడ్చియేడ్చి మూర్ఛిలి లేచి యెట్టకేల
కౌదలం బాదు; దైవంబు నఱచి తిట్టు.

ఆ. రాలు పగులునట్టులా లేడ్చుచున్నను
గంటఁ దడియుఁ గొనఁడు గర్షకుండు
ఎదియు జరుగనట్లె యెడనెంచి క్రమ్మఱ
దుక్కిదున్నఁ బొలముత్రోవఁ బట్టె.

ఆ. ప్రొద్దువోయి వచ్చెఁ; బొలఁతి యేడ్చుచునుండెఁ
బాపవైన యాటపాట లెత్తి;
ఊఱడించె భర్త; యూఱడ కలుకమై
"రాయివీ" వటంచు రమణి దెగడె.

క. పతి యట్లనె "నీ పాటకు
శ్రుతిగలుపఁగనైతినంచు రోషింతువు; నా

కత వినుము; నిన్నరాతిరి
సతీమణీ! నా కొకండు స్వప్నము వచ్చెన్.

ఆ. అయితిఁ జక్రవర్తి; నబ్బె నైశ్వర్యంబు
గలిగి రష్ట పుత్త్రికులును నాకు
వైభవముగ నుండ వచ్చె మెలంకువ
మాయమయ్యె నా సమస్త మిపుడు.

క. ఎనమండ్రు సుతులకై యే
డ్తునా? యొక కుమారుకొఱకు దుఃఖించుదునా?
మనమునఁ దోఁచక యే నే
డ్వనైతిఁ; జెపు మేమి చేయవలెనో వెలఁదీ!"

## ౨౮. రాజు - పౌరాణికుఁడు

ఆ. కలఁడు మున్నొకండు క్ష్మాపతి ప్రాజ్ఞుండు
తత్త్వసాధకుం డతండు; దినము
భాగవతముఁ జదివి పండితుం డొకఁడు త
దర్థ బోధసేయు నాతనికిని.

ఆ. "బ్రహ్మమొకటె నిజము; బ్రహ్మాండమంతయు
వట్టి మాయ" యంచుఁ బాడుచుండుఁ
జిలుకపగిదిఁ; దుదికిఁ "దెలిసెనే నీ?" కంచు
నడుగుచుండు నతఁడు పుడమిఱేని.

ఆ. పలుకుచుండుఁ బతియుఁ "బ్రథమంబునం దీవె
తెలిసికొమ్మ! లెస్స దీని" ననుచు
స్పష్టతరము మరియు స్పష్టతమంబుగా
వివరణం బొనర్చి వినుపఁదొడఁగె.

ఆ. ఎప్పటట్లె తేఁడు చెప్పందొడంగె; నా
బుధుఁడు దలఁచె వగపుఁబొంది యిట్లు
"పలుకు 'ముందు లెస్స తెలిసికొమ్మి'వంచు
నృపతి; యేమి తెలియు టింతకన్న?

గీ. త్రచ్చితిని భిన్నతత్త్వ శాస్త్రములనెల్లఁ
బలుతడవ లే వచించితిఁ బాఠములను;
అరఁటిపండొల్చి చేఁబెట్టినట్లు స్ఫుటము
గఱపుచుంటి; నట్లనునేల క్ష్మావరుండు?"

క. తననలుపు గురిజపగిదిని
జనుండు విద్వాంసుఁడయ్యుఁ జాలఁడు దెలియం
దన యజ్ఞానము; ననుకొను
"ననవద్య ప్రతిభగలిగినట్టిఁడ" ననుచున్.

క. అనుభూతి దనకు శూన్యం
బని దినకతిపయము గడవ నాత్మకుఁ దెలిసెన్
అనవరతనియమనిష్ఠలఁ
గొని యపరోక్షానుభూతికొఱకుఁ గడంగెన్.

ఆ. "బ్రహ్మమొకటె నిజము; బ్రహ్మాండమంతయు
వట్టి మిథ్య" యన్న ప్రాఁజదువది
యమ్యె నవగతముగ నది విస్ఫుటంబుగా
జ్ఞానియై యతండు సన్న్యసించె.

ఆ. ఇల్లువిడిచి యాతఁడేఁగుచు నడవికి
క్షితివరునకు నిట్లు చెప్పిపంపె
శిష్యునొక్కరువునిఁ; "జిరకాలమునకు నీ
తెలియుమన్న దానిఁ దెలిసికొంటి."

## ౨౯. ఉప్పుబొమ్మ

క. లవణమయప్రతిమ యొకం
"డవలోకము నేసివత్తు నంబుధిలోఁతు
వివరింతును లాఁతుల" కని
ప్రవేశమొనరించెఁ తిరిగిరాదెన్నటికిన్.

ఆ. తెలియ దానిలోఁతు తీరమందెందఱో
కాచుకొనిరి పెద్ద కాలముగను
కరిగిపోయె నీటఁ జొరఁగానె యాబొమ్మ;
యింక లోఁతుగుఱిఁచి యెవఁడు దెలుపు?

క. పురుషుఁడు సమాధియందుం
బరమాత్మైక్యంబుఁగాంచు వాకొనలేఁ డ

త్రుటి నొక్కమాట బ్రహ్మ
స్వరూపముంగూర్చి యెఱుఁగవచ్చిన ప్రజకుఁ.

# ౩౦. పితాపుత్రులు

క. గురుకులమున విద్యార్జన
పరిపూర్తింజేసి మగిడి స్వగృహంబునకుఁ
అరుదెంచి యాత్మపదముల
కెరగిన పుత్త్రకులఁ దండ్రి యిటు ప్రశ్నించెన్.

క. "కఱచితిరి శ్రుతులునాల్గును;
బరామృశించితిరి మీ రుపనిషద్దశకం;
బరసితిరి దర్శనంబుల
నెఱిఁగింపుఁడు బ్రహ్మమనఁగ నేమి?" యటంచుఁ.

ఆ. అప్పగించె జ్యేష్ఠుఁ డా శాస్త్రపంక్తుల
గ్రుక్కత్రిప్పకుండ నొక్క మొగినిఁ;
బొల్లువోవకుండ బోధింపఁదొడఁగెను
వానియర్థమెల్ల స్పష్టముగను.

క. అన్న ముగించిన పిమ్మటఁ
బిన్నాతండూని మౌనవృత్తిని, వ్రాలం
గన్నులు, పెదవులు పెకలక
చిన్నని మాటైనరాక చెదరకయుండెఁ.

క. జనకుండు వలికెన త్తఱిఁ
గనీయసుండైన పుత్త్రుఁ గని "బ్రహ్మము వా
఩్మనసాగోచరమని నా
యనా! యెఱింగితివి; హర్షమయ్యె" నటంచున్.

## ౩౧. ఇదిగాదు - ఇదిగాదు

ఆ. అత్తవారియింటి కల్లుండు క్రొత్తగా
నరుగుదెంచెఁ గూడి యాత్మసఖులఁ
దమదునేస్తురాలి రమణుని దరిసింప
వచ్చి రిరుగుపొరుగు పడుచు లటకు.

గీ. సమవయోరూపములతోడఁ జాపపయినిఁ
జావడింగూరుచున్న యా జనగణంబుఁ
దలుపువెనుకల డాఁగి తత్పరతఁగనుచు
నొకరినింద్రోసికొను చొక్క రొదిగియొదిగి.

గీ. సఖినిఁబ్రశ్నించి యొక్కనిం జారుమూర్తిఁ
దర్జనింజూపిఁ "యితఁడె నీ దయితుఁ?" డంచు
విఱిచిపెదవిని బొమముడి బిగియఁజేసి
యౌదలంద్రిప్పె నాపిల్ల యడ్డముగను.

క. మరియొకని నుజ్జ్వలాంగునిఁ
గరాంగుళినిఁజూపి "నీదు కాంతుఁడితండే?

ఎఱిఁగింపు" మనుడు నయ్యది
పరికింపక పెడమొగంబువయిచి నిలఁబడెన్.

ఆ. చూపిమరల వ్రేల సుందరాకారు వే
ఱొకని "నోసి! నీ ప్రియుండితండె?"
అనుచునడుగ విసువుకొని మోము ముడిఁచె నా
కన్నె; వారితండు గా దనంగ

ఆ. తిరిగియొక్క దివ్యతేజోవిలాసుని
నందు మిగిలియున్న యతనిఁజూప
నగును నాక, కాదు నాక స్మితాస్యయై
చెలులవంకఁ దిరిగెఁ జిన్నపడుచు.

క. ఇదిగా దిదిగాదని కల
పదార్థముల నెల్లఁ జేయఁ బ్రతిషేధ మిఁకన్
ఎదిశేషించునొ బ్రహ్మం
బది; దానిం గన్న మౌనియై హర్షించున్.

## ౩౨. ఊసరవెల్లి

ఆ. "అడవికేఁగి మొన్న నాకులు గోయంగ
నెక్కియుంటి నొక మహీరుహంబుఁ;
గానఁబడియెఁ బురుగొకం డందుఁ జక్కని
యెఱ్ఱపట్టుబ్రాటి కెన యనంగ."

క. అని యొక్కరుఁడు వచింపఁగ
విని వేరొక్కండు "కానిపించెను జుమి ! నా
కును నది ; కాదది యెఱ్ఱది ;
కనఁబసరికవన్నె" దనుచు గట్టిగఁ బలికెన్.

క. ఇరువురి వాదము విను చొక
తెరువరి "అద్దానిఁ గాంచితిని నేనును ము ;
న్నెఱుపుం బసరుం గాదది
యరయంగాఁ బసుపురంగు"దని వాదించెన్.

క. మరి యొకఁడనె ధూసరమని ;
యొరుఁడనె నూదా యటంచు నొక్కొక్కరుఁ దా
ర్పరికించిన వర్ణంబే
సరియైన దటంచుఁ బలుకసాఁగిరి మరియున్.

ఆ. అలఁతితడవు వాదులాడి వారందఱు
చనిరి కాన, కందుఁగనక దాని
నా మహీజ మూలమందుఁ గూర్చున్న బై
రాగిఁ గాంచి దాని రంగు నడుగ.

క. అతఁడనె "నాకీ జంతువు
కత యామూలాగ్రముగను జ్ఞాతమ ; మీలోఁ
బ్రతివారు గన్నదియు సూ
నృతంబ ; యది పెక్కురంగులీను సతంబున్.

క. అది యూసరవెల్లి సుఁడీ!
తదీయవర్ణములు బహువిధంబులు ; మరియు
క్కడనున నిర్వర్ణమునగు :
సదా పరీక్షించువారె చాలుదు రెఱుఁగన్."

క. అనవరతము భగవచ్చిం
తనంబుఁ గావించువాఁడె తద్యాథార్థ్యం
బును దెలియఁజాలు నవ్విధిఁ
గనఁబడు నీశ్వరుఁ డనేకగతులఁ బెరలకున్.

## ౩౩. మణివిక్రయము

క. "కొనిపోయి విపణి కీమణిఁ
గొనఁజూపుము ! రమ్ము తెలిసికొని యెంత వెలన్
మనకిత్తురి క్రేత" లని పం
పె నొక్క ధనికుండు పణ్యవీథికి భటునిన్.

గీ. అగపబపఁ బోయి వంకాయలమ్మువాని
కతఁడు గొండొక తడవిట్టు నట్టుఁ ద్రిప్పి
ఇత్తు వంకాయలను నాలుగెత్తుకోయి!
దీని మూల్యంబుగా నంచుఁ దెగి వచించె.

గీ. అంత బంటు సెట్టి "నయ్య ! యేమేని మా
ర్మాట గలదె ?" యనుడు "మాటలేల ?

అంతకన్న నొక్క యణకాయయేనియు
నీయఁబోవ: నిదియె హెచ్చు టనియె.

గీ. వాస్త్రికుని డాసి లంపతావాఁడు చూప
నతఁ డెగాదిగఁ జూచి క్రేయముగఁ దలఁచి
"ఓయి ! తొమ్మిదినూర్ల రూపాయ లిత్తు;
నిత్తువే నిచ్చి పొ" మ్మనె; నీయ కతఁడు.

ఆ. పలికె వణిజుతోడ "వెల కొంత హెచ్చింపుఁ
డార్య !" యనుచు; నాతఁ డనియె "గిట్టి
దంతకన్న; నీయ నణవీసమేనిఁ; జె
ప్పితిని నీకుఁ బెద్దవెలనె మొదట".

ఆ. అచటినుండి లెంక యరిగి చూపఁగ రత్న
వర్తకున కతండు పాఱఁజూచి
యొక్కతూరి, నొడివె "నొకలక్ష రూపాయ
లిత్తు నీకు వలయునేని" నంచు.

ఆ. వారివారి తెలివిఁబట్టి మహాత్ముల
మహిమఁ దెలియఁగలరు మహిజనములు;
గొఱఁతరా దొకింత పురుషోత్తములకు వా
రలకు; బయలువడెడు నలుచఁదనమె.

## ౩౮. శివుఁడా ? బ్రహ్మ ?

క. శివుఁడా ? బ్రహ్మ ? అధికుం
డెవఁ ? డని మీమాంససేయ హేమాహేమీ
లవు విద్వద్వర్యు లహ
ర్దివంబు పెనువాద ధూళి రేఁపి రొకతతిన్.

క. "ఇదమిత్థ" మనుచు వారలు
తుదిసిద్ధాంతం బొనర్ప దుర్బలులై య
య్యదనన్ నిష్పాక్షికుఁడని
యుదగ్రపండితుఁ డనియు, మహోత్తముఁ డనియున్.

ఆ. భవ్యయశముఁ గన్న "పద్మలోచను" డని
తెలచి తమదు తగవుదీర్పుఁ డనఁగఁ
గాకదంతగణనగా రోసి యాచర్చ
లెట్టకేల కనియె నిట్టు లతఁడు.

క. శివుఁగాని బ్రహ్మఁగానీ
యవలోకింపంగ లేదయా ! నేఁ గానీ
యెవరలుగానీ మా పూ
ర్వవంశజులు పెక్కులగు తరంబులవారున్.

## ౩౫. భగవంతుఁడు రెండుమాఱులు నవ్వెను

గీ. "భయపడకుమమ్మ ! నీపుత్త్రు బ్రదుకఁజేతు
వదలుమీ ! నాకు; నాదె యాబాధ్యత" యని
యాడ వైద్యుండు, భగవంతుఁ డాలకించి
నవ్వె లోలోన రోగి ప్రాంతమున నిలిచి.

గీ. అన్నదమ్ములు తమదు పిత్ర్యమగుభూమి
భాగములొనర్చి సమముగాఁ బంచుకోఁగ
"నాదియిది; నీదియది" యంచు వాదులాడ
నిలుచు నవ్వుచు నీశ్వరుం డలఁతిదౌల.

క. ఎఱుఁగం డగదంకారుఁడు
హరింపనున్నాఁడు వాని ప్రాణంబుల నీ
శ్వరుఁడని; తెలియరు పరమే
శ్వరునిది యీ విశ్వమనుచు భ్రాతలు నిస్సీ !

## ౩౬. "సర్వం విష్ణుమయం జగత్"

క. క్రమముగఁ బఠించి శ్రుతిశా
స్త్రములను సాధనలొనర్చి తగ "సర్వం వి
ష్ణుమయం జగ" త్తనెడు వా
క్యము యాథార్థ్యంబెఱిఁగి యొకం డిలువానెఁ.

క. పరునకుఁ దనతోఁ దనకుం
బరుతోఁబనిలేక వాడవాడలఁ దిరుగున్;
దరిసింపఁ గుక్క గాడిద
హరిస్వరూపముగ నమ్మహాత్ముఁడు దనలోన్.

ఆ. అతఁడు బాలుపగిది నవ్యాజముగ నవ్వఁ;
బరుగువాఱుఁ బిచ్చివానికరణి;
నఱచుఁబో ! పిశాచమావిష్టమైనట్టు
లితఁడు వెడఁగటంచు నెల్లరనఁగ.

క. నడయాడుచుండ వీథులఁ
బడి యే పుణ్యాత్మురాలొ ! వానింగని ప
ట్టెఁడు సాదంబును బెట్టెను
గడుంగనికరంబు హృదయగర్భంబుబుకన్.

ఆ. దానిఁదెచ్చి వాఁడు తరుమూలముం జేరి
తినుచునుండ వచ్చె శునక మొకటి;
యొక్కముద్ద దానికొసఁగుఁ; దానొక ముద్దఁ
దినును; మిత్రు లట్లు దినిరి వారు.

క. కని వానిఁ బిచ్చివాఁడని
జనములు నగుచుండఁ గాంచి సాదనె "నవ్వం
గను నేల ? హరియె కూర్చుం
డెను హరికడ; హరియ హరి కిడెం గబళంబుల్.

ఆ. హరులు మీఁగలెల్ల ; హరుయి వృక్షములెల్ల;
హరులు పులుఁగులెల్ల ; హరులు పసులు;
హరివినా యొకండు పరగెనే ? విశ్వంబు
నం" దటంచుఁ బలుకు చతఁడు పోయె.

## ౩౭. అర్ధజ్ఞాన మనర్థకరము

గీ. "బ్రహ్మమయ మీ సమస్తవిశ్వము నృపాల !
దాన బ్రహ్మస్వరూపు లందఱు" నటంచు
సదుపదేశం బొసంగ నాచార్యుఁ, డతఁడు
గళితసంకోచుఁడై పెద్దమెలమి నొందె.

క. పరికించి రాణి "బ్రహ్మ
స్వరూపు లెల్లరునుగాన వాస్తవ భేదం
బరయఁగ నీకును నీదగు
పరవుడునకు లే" దటంచుఁ బ్రభువు వచించెన్.

ఆ. కొంచెమాఁగి మరలఁ గొంకక యిటువల్కె
"నట్టులగుట రేపు దొట్టి నీదు
దాసి నాదు రాణిఁ జేసికొందు" నటంచు;
రాజె మదినిఁ బెద్దరాయి పడఁగ.

ఆ. రాజ్ఞి యంత గురుని రప్పించి "యో స్వామి !
త్వదుపదేశ మిట్లు పరిణమించె"

నని స్వభర్త యాడినట్టి యమ్మాటలు
వాని పూనికియును బలికె నెల్ల.

క. ఉపదిష్ట సదర్థంబును
నపక్వహృదయులకుఁ దోఁచు నధరోత్తరమై
విపరీతగుణం బిచ్చును
వపుర్విశేషముల కమృతపానం బెనిఁగా.

గీ. ప్రభ్వి నోదార్చి యాచార్యపాదుఁ డపుడు
"అమ్మ ! నీభర్తతో నీగృహంబు నందె
నారగించెద నేఁ; డొక్క టాచరింపు"
మనుచు వచియించెఁ జెవిలో రహస్య మొండు.

క. తినుచుండె ఱేఁడు; వడ్డిం
చెను గోమయ పిండమొండు చెలువ యతనియా
కున; నిస్సిసీ ! యటంచును
జనపతి కాలాగ్నిరుద్రసదృశుండయ్యెఁగా.

ఆ. పరిహరించి భుక్తిపాత్ర లేవఁదలంచు
ధరణిపతినిఁగాంచి గురుఁడువలికె
"నగుదుగాదె ? పెద్దయద్వైతి ; విబు గోమ
యాన్న భేదమేటికయ్య ! నీకు ?"

గీ. ఆజ్యధారకు జ్వలియించు నగ్నిభాతి
భగ్గుమనిమండి యాచార్య వచనమునకుఁ

"బరమగురుఁడవు నాకు; న ద్వైతనిధివి;
తినుము ! పెండను జూతు" నంచనె నృపుండు.

క. గురుఁడనియె "సరే ! తింటును;
బరికింపు" మటంచుఁ బలికి భక్ష్యమునువలెన్
దరమిడి గోమయకబళము
ధరణిపుఁ డేవగొనిచూడఁ దమి భుజియించెన్.

క. కని వాంఛి తలను నరపతి
యనుతాపంబునువహించి యర్థజ్ఞానం
బనయం బనర్థకర" మని
యనుకొని వందనమొనర్చె నాచార్యునికిన్.

## ౩౮. ఎల్లజంతువు లీశ్వరాత్మకములు

గీ. "ఎల్లజంతువులును నెల్ల పదార్థంబు
లీశ్వరాత్మములుగ నెంచి బత్తి
శిరసువ్రాల్చుఁ" డనుచు గురుదేవుఁ డుపదేశ
మిచ్చిపంపె శిష్యబృందమునకు.

ఆ. సమిధలేజితేర ఛాత్రుఁ డొక్కండేఁగి
కానఁ దిరుగుచుండ వీనులఁ బడెఁ
"దొలఁగిపొండు ! త్రోవఁ దొలఁగి పొం; డేన్గొండు
తిక్కరేఁగి యిదిగొ ! తిరుగుచుండె."

గీ. అన్నవాక్యంబు విని దానితెన్ను రాక
పిక్కబలమును జూపె నల్దిక్కులకును
శిష్యుఁ డొక్కండు దక్క నశేష జనము
మిత్తియోయంచు హడలెత్తి మెయిసెమర్ప.

క. దరిసించి కరిని బరమే
శ్వరునిగ భావించి నిలిచి ప్రాంజలియై ని
బ్బరముగ "సహస్ర శీర్షా
పురుష" యనుచుఁ గంఠమెత్తి పూనె స్తవింపన్.

ఆ. "తొలఁగిపొండు! త్రోవఁ దొలఁగి పొం" డంచు మా
ష్టీఁడు పెద్దగొంతు చీల్చుకొనుచుఁ
జప్పటులఁ గరంబుఁ జఱచుచు నఱచిన
నపసరిల్ల కాతఁ డట్ల నిలిచె.

ఆ. వాని డాసి గజము పట్టితొండంబుతో
నెత్తి కూలవైచె నెత్తునుండి
యొడలు చిదికిపోవఁ బడి ప్రక్కనేయున్న
పలుఁగురాతిపైనిఁ బ్రదికె నెట్లో.

గీ. వాని వృత్తాంత మెఱిఁగి సబ్రహ్మచారి
బృంద మాచార్యుతో నట కేఁగుదెంచి
సలుపు చుచితోపచారంబు లలపుఁ దీర్చ
"ఏన్గుఁ గనియును దొలఁగవై తేల?" యనుడు.

ఆ. "ఎల్ల జంతువులను నీశ్వరాత్మము లంచు
గురుఁడు గఱపినట్టి కఱవులు విని
యిస్సి ! బొజ్జనమ్మి యేటఁ బడ్డటులైతి
ద్విపము నీశ్వరునిగ విశ్వసించి."

క. అని శిష్యుఁ డాడ దేశకుఁ,
డనెఁ "గరి భగవత్స్వరూప మనుకొన్నట్లే
యనుకొనకుంటి వదేటికి ?
మును మావటివాని ? నెంత మూర్ఖుఁడవోయీ !"

## ౩౯. పరపాప పరిగణనము నరకహేతువు

గీ. ఒక్క పత్తనమందు నొండొంటి కెదుట
నలరు దేవాలయమును వేశ్యాలయంబు,
స్వర్గనరక లోకంబుల భాతి; నందుఁ
గలఁడు సన్న్యాసి యొకఁ; డిందుఁ గలదు సాని.

ఆ. అటకు భక్తకోటి యిట కిసీ ! విటకోటి
యిసుకరాలనట్టు లేఁగుదెంచు
మూటఁగట్టఁ బుణ్యమును గొంద, అన్యులు
పాపములను బ్రోగువఱచు చుంద్రు.

క. అసదృశభక్తి రచించుచు
ననకృ ద్భగవత్తవంబు, లసకృ త్పూజల్,

వసియించుచుండు నాతా
పసుఁ డాదేవళమునందు బహుకాలముగాఁ.

ఆ. చూచిచూచి సైఁచిసైఁచి కొండొకనాఁడు
పిలిచి వేశ్య నతఁడు పలికె నిట్లు ;
"ఓఁకిలింత పుట్టుచున్నది నినుఁ జూడఁ;
గడిఁది నీ చరిత్ర కంపుగొట్టు.

గీ. పుచ్చిపురుగులువడి దిక్కుమ్రొక్కులేని
గతిననుభవింపఁగలవు సూ ! కడకు నీవు
కాకులుంగ్రద్దలుం దక్కఁ గానరాఁడు
నీకడకు నొక్కఁడేని మానిసియు నాఁడు.

క. యాదృచ్ఛికముగనే నీ
వీదేవాలయము వంక దృష్టించుటచే
నీ దోస మలఁతి యణఁగెను ;
బోదువు గాకున్న నరకమున కేనాఁడో !

గీ. కలువులో బిడ్డ నమ్మకొఁ గరితవోలెఁ
గడుపు కక్కుర్తికై నీదు నొడలి నకట !
అమ్మచుంటివి; యెంత పుణ్యమునొనర్చి
పడసితో ! నీవెఱుంగవు పాపురాల !

ఆ. పాపజీవులగును బశుపక్షిజడములు,
పుణ్యజీవి మానవుఁడు ధరిత్రి,

నాచరించి పాప మా జీవి తిరిగి ప
శ్వాదిజన్మ లందు నంద్రు బుధులు.

క. పశ్చాత్తాపమె పెను ప్రా
యశ్చిత్తముగాన దానినంది, వదలి నీ
దుశ్చారిత్రము, జను ల
త్యాశ్చర్యపడంగ బ్రదుకుమా ! సాధ్వివలెన్."

ఆ. అనుచు బుద్ధిగఱప నా సాని యెంతయుఁ
బొంది సిగ్గు, స్వకృతమునకు వగచి
యాదినంబునుండి యల పులుగడిగిన
ము త్తెమై మనంగఁ బూనెఁ బ్రతిన.

గీ. ఇలను మిండంద్రమరగిన కలికిగాని
మీఁగడలు మ్రింగమరగిన మెలఁతగాని
మాన దలవాటులందు రా మగువ మగిడి
పడపుసాఁగించు మఱచి యెప్పటివిధాన.

గీ. కాని పాపం బొనర్చిన క్షణమునందె
తాపసో క్తులు స్మరియించి తాపమొందు;
నెడఁద ననుతాపవహ్నిలో నుడుక నేడ్చు;
దేవుని క్షమింపుమనుచుఁ బ్రార్థించుకొనును.

ఆ. స్వోపదేశమెల్ల నూషరో ప్తంబైన
బీజమును బొనర్చు వెలవెలందిఁ

గాంచి తలఁచె "దీనికడ కెందఱేతెంౘ్రో ?
విటులు దినము లెక్కవేతు" నంచు.

గీ. భోగినీమందిరక్షేత్రమునకు వచ్చు
త్రైర్థికుల నశ్మఖండసంతతి గణింప
గుడిగడపముందు మస్కరి కూరుచుండె
స్నానసంధ్యాజపాదులు మానివైచి.

క. తల కొక్కటిగా నెంచుచు
శిలాశకలరాశిఁ బేరిచి భుజంగినిఁ దాఁ
బిలిచి యొకనాఁడు చూపుచుఁ
బలికెను సన్న్యాసి "ఓసి ! పాపీ ! కంటే ?

గీ. కాదిది దృషచ్చయంబు ; నీ కలుషచయము ;
పెరిగెఁ బదినాళ్లకిం ; తిట్లు పెరిగిపెరిగి
వింధ్యగిరివోలె నాకాశవీథిదాటు
నీదు జీవితమం ; దేమికాఁ దలంతో ?

గీ. ఓసి ! మలభక్షకకృమికీట యోనులందుఁ
బొనఁగలవు సుమ్ము ! కోటానకోట్ల జన్మ ;
లడఁగునో యప్పటికినేని నడఁగరాదొ ?
నీ మహాపాప ; మిఁకఁ బొమ్ము ! నీ" వటంచు.

క. విని రోషదంతి వడఁకుచుఁ
గనుఁగవ బాష్పములు గాల్వగట్టఁగ, నాఁపం

గనురాక యేడ్చె దీనతఁ ;
దను క్షమియింపుఁ డని దేవతలఁ బ్రార్థించెన్.

క. శునివలెఁ జీవాట్లనుదిని
తన నీచపుబ్రదుకు రోసి తలఁచు విడువఁగన్
ననఁబోఁడి ; కాని మిండఁడు
చనుదేరఁగ మఱచి పరవశత్వము నొందున్.

క. కుటిలాలకఁ గొంపోయిరి
విటజనకరపంజరంబు విడిపించి హటా
హటి యమదూత లొకవు డెం
తటి మోహము రేఁగెనోకదా ! యాతనికిన్ ?

క. పరలోకమునకు నరిగిన
తెఱవను వెన్నంటి యాయతియు దానిగతుల్
పరికింపఁ దలఁచియో యన
శరీరముంబాసి నాఁడె చనియెన్ దివికిన్.

క. నడిదారిని హరిదూతలు
వడివడి యమభటులవెంటఁబడి యాపడఁతిన్
విడిపించి పూలపల్లకి
నిడి స్వర్గంబునకు దాని నేఁగిరి కొనుచున్.

క. యమకింకరు లా మునినిం
దమలోకంబునకు రమ్మనం గని యతఁ "డ

క్రమమిది; సీ ! సానికి స్వ
ర్గము ! నారకమొక్కొ నాకు బ్రహ్మోష్ఠునకున్ !"

క. అనవుడు వారిట్లాడిరి
"మునిబ్రువుఁడ వన్యదోషములగణనమె నీ
కనవరతంబును జాంద్రా
యణాదికవ్రతములును, మహాజపతపముల్;

గీ. వేశ్య యాజన్మమిస్సి ! పాపిష్ఠురాలె;
కాని యనుతాపవహ్నిలోఁ గ్రాఁగిక్రాఁగి
తన్ను క్షమియింపుఁడని దేవతలనుగూర్చి
యేడ్చియేడ్చి విశుద్ధిఁదత్కృపనుబడసె.

ఆ. అనుగృహీతయయ్యె నాసాని యద్దానఁ;
బుణ్యలోకమునకుఁ బోవుచుండె;
నన్యపాపసంచయమునె ధ్యానించు నీ
వరుగవలయుఁగాదె నరకమునకె !"

## ౭౦. కూపస్థమండూకము

క. చిఱుకప్ప యొకటి నూతం
జిరకాలమునుండియును వసించుచునుండెన్
బరగ నది యందె పుట్టెం;
బెరింగె నందె యెఱుఁగదది వెలుపలిజగమున్.

ఆ. అరుగుదెంచె నొక్కపరి క్రొత్తకప్ప యా
బావిలోని కెట్లొ; ప్రశ్న సేసెఁ
బ్రాఁత "దెచటినుండి వచ్చితీ" వని; క్రొత్త
"యుదధినుండి వచ్చియుంటి" ననియె.

ఆ. "ఉదధియా ? యదెంతయుండు ?" నాఁబ్రాఁతది,
క్రొత్తదనియెఁ "జాలగొప్ప" దనుచుఁ;
బ్రాఁతకప్ప సాఁచి పాదయుగ్మము లెన్న
యడిగె "నింత పెద్దదా ?" యటంచు

ఆ. "ఇంతకన్నఁ బెద్దదే !" యనెఁ గ్రొత్తది;
ఇవలినుండి మాఁకి యవలిదెసకుఁ
బ్రాఁత దడిగె "నింతబావికన్నం గూడ
నది మహత్తరంబె ?" యనుచు మరల

క. చిఱునవ్వునవ్వి క్రొత్తది
మరలన్ వచియించె "హస్తిమశకములకటుల్
పరగున్ సముద్రకూపాం
తరంబు వేయేల ?" యని; మొదటికప్పంతన్.

గీ. అలిగి "నా నూతికన్న మహత్తరంబు
లేదు; ముల్లోకములయందు లేదు ! నిజము !
పొమ్ము ! నోర్మూసికొని వేగఁబోవకున్న,
నవ్వలికి గెంటుదును జూడు" మనుచు నఱచె.

## ౪౧. ప్రేక్షకుఁడు

ఆ. చాఁపచుట్ట నొండు చంకఁబెట్టి యొకండు
కనఁగ వీథినాటకమున కరిగె;
నాట మొదలుపెట్టు నదను గాలేదని
వినియె నచటనున్న జనమువలన.

ఆ. నేలఁబఱచెఁ జాఁప నిద్రింపఁదలఁచి తా
నలఁతి తడవు; పిదప మేలఁకువగొని
కనఁగ నాట ముగిసెఁ; జనెఁ జాఁపచుట్టను
జంకఁబెట్టి మగిడి సదనమునకు.

గీ. "భాగవతతత్త్వ మెఱుఁగంగ వలసినంత
కాలమున్నది గద! తొందరేల?" యనుచుఁ
బ్రాయమంతయుఁ బురుషుండు వ్యర్థపుచ్చి
దానిఁ దెలియకె వచ్చినదారి నేగు.

పరమహంస కథావళి
సమాప్తము.

★

# శివానంద కథావళి



## ౧. ఆపదిమ్రొక్కులు - సంపదిసంపట్లు

ఆ. నాఁడు గణితపరీక్ష : యానాఁడు లేచి
ప్రొద్దుటనె బాలుఁ డొక్కఁడు పోయి గుడికి
మ్రొక్కుకొనె "దేవ ! యీ గండమును గడపుము !
ఉదధి దాఁటించి చేర్పుమీ ! యొడ్డు నన్ను.

గీ. పరపరీక్షలఁ గల ప్రశ్నపత్రములకు
వ్రాసితిని లెస్స ప్రత్యుత్తరములు ; నాకు
గణితశాస్త్ర పరీక్షనాఁ గాళరాత్రి ;
దీనుఁడను భక్తుఁడను నన్నుఁ దేల్చు దేవ !

గీ. నన్ను నుత్తీర్ణునిం జేయవన్న ! నీకు
ధనముఁ బాతికరూపాయలను వ్యయించి
పెద్దగఁ బ్రసాదమును సమర్పింతు ; భక్తి
సలుపుదు సహస్రనామ పూజలును దేవ !"

క. అని మ్రొక్కుమ్రొక్కి యింటికిఁ
జని తాఁ జూచుకొని మంచి శకునంబు నొగిం
జని పాఠశాల కాసన
మున నాసీనుఁడయి మరల మ్రొక్కుచునుండెన్.

౧. కనులు దెఱచునరికిఁ గనఁబడెఁ బ్రశ్న ప
త్త్రింబు ముందు; గుండె తటతటమనె
వణఁకుచున్న వ్రేళ్ళఁబట్టి దానినిఁ గాంచెఁ
జదువుకొనియె మెల్ల సొంత ముగను.

౨ కుదుటఁబడెను గుండె; గొంఁది యూఱట గల్గెఁ;
గనియెఁ బ్రశ్నపత్త్రికము సుళువుగఁ
దనదు మ్రొక్కు నేఁడు దప్పక ఫలియించు
నన్న ధృతియుఁ గలిగె నతని కపుడు.

౩. వదల కొంకముక్కునేని నా ప్రశ్నపత్త్రి
మతఁడు ప్రత్యుత్తరించె సమంజసముగఁ
దలవని తలంపుగాఁ; బ్రసాదమున కాళ
పడెనొ దేవుండు దయఁజూపె వానిపయిని.

౪. స్వల్పకాలముననె బాలకుండు ముగించెఁ
బ్రశ్నపత్త్రికంబు; బయటి కరుగ
కటనె యుండి భగవదర్ప్యప్రసాదంబు
నకు మదింపువేయుటకుఁ గడంగె.

౫. "ఇన్నాలు నారికెడములు
మున్నార్కదళీఫలములు; పోరి మినుపవడల్
నన్నాలు; పానకంబును
బన్నుగ వడప"ప్పటంచుఁ బట్టీ వ్రాసెన్.

గీ. వ్రాసి క్రమ్మఱఁ బరికించి వాఁడు దలఁచె
"నింతవ్యయమేల? యీశ్వరుఁ డీ ప్రసాద
మారగించునె? తగ్గింతు వ్యయము సగము"
అనుచు మరల మదింపు వేయందొడంగె.

గీ. అదియు వానికిఁ దోఁచె హెచ్చనుచు; దాని
సగము చేసె; నదియుఁజేసి సగ మనుకొనె
"నీ వ్యయంబెల్ల వృథ; కొను నీశ్వరుండు
భక్తితో నిచ్చు పువ్వేనిఁ బత్రిమేని.

ఆ. కాన నొకటిరెండు కదళీఫలంబుల
నాచరింతు దేవతార్పణంబు"
అని తలంచుచుండ నవధికాలంబొట
మ్రోఁగె గంట; యిచ్చెఁ గాగితములు.

ఆ. బయటి కరుగుదెంచి 'జయమొందితి' నటంచు
పట్టరాని ముదముపడుచు వాఁడు
ఎగురుకొనుచుఁ బఱచి యింటికిఁ దండ్రితోఁ
దనదు గెలుపు తథ్యమనుచుఁ బలికె.

ఆ. ప్రశ్నపత్రి మడిగె బాలునిం దండ్రి; కా
గితము లిచ్చెఁ గొన్ని పిత; కతండు
గన సమాధిపత్రికము లవ్వి; యటనిచ్చి
నవి మదింపు వేసినవి; కట! కట!

క. భగవంతు నిసీ! వంచిం
పఁగఁ దలఁపఁగ దానె యకట! వంచితుఁ డయ్యెన్
భగవదపచారమునకుం
దగినట్టులె శాస్తిగలుగుఁ దప్పదు తనకున్.

## ౧౨. విశ్వమున విశిష్టుఁ డెవఁడు ?

ఆ. పాదధూళి రేఁగె బ్రహ్మాండమున వేఁడు
జీవకోటిలో విశిష్టుఁ డనుచు
మొదట లేచి పలికె భూదేవి దొడ్డమ్మ
వాక్కులందుఁ దొట్రుపాటు గదర.

మ. కులశైలంబులఁ బుణ్యతీర్థ సుమహా
కూపారముల్ మోయుదున్;
గలిగింతుం గడుఁ బాడిపంటలు ప్రజా
కాండంబు వర్ధిల్లఁ, గొ
ల్లలుగాఁ బంచుచునుందు నా ధననిధుల్
వార్వీరు నా కెల్ల వా
రలకున్; నేన మహత్తర న్నగుదు
మీరల్ లెస్స యోజింపుఁడా !

చ. అన విని దాని సైఁపక
మహాభుజగుండగు నాదిశేషుఁ డి
ట్లనె "ధరియింతు నాదగు
పణాగ్రమునందు ధరిత్రి: నింతె కా

దనయము దేవదేవుఁ డగు
నంబుజనాభుని సేవసేయు పా
వనతముఁడన్ మహాత్తరుఁ
డెవండు నను న్వెలిగా వచింపుఁడా !"

క. పలుకది విని విశ్వము బీఁ
టలువాఱఁగఁ బెద్ద నగి మృడానీపతి "యీ
చిలుపను దాలిచితిని నా
గళమున; నాకన్న నెవరు గలరు విశిష్టుల్?

క. అల మృత్యుదేవతకు నిల
బలియగును బిపీలికాది బ్రహ్మాంతంబున్
గెలిచితినిగాదె దానిని;
హాలాహలాశనుఁడ నేన యధికతరుండన్".

క. ఆలించి శూలిమాటలు
కైలాసము పలికె "శివుఁడు గాఁపురముండెన్
మా లోఁగిట; నా శృంగము
చాలు మదుచ్చైస్తమతను స్థాపింపంగన్."

క. అది విని ప్రతిధ్వనింపఁగఁ
బదిదిక్కులు, రావణుండు పదిముఖములతో
వదరెం "బెకలించితి ని
ర్వది చేతుల నీ ధరాధరంబును దొలుతన్.

క. ఆడించితి కేలంగొని
క్రీడాకండుకమువోలె క్షితిధరమును నీ
రేడు జగంబుల నాకె
వ్వాఁ డున్నాఁ డీడు బాహుబల సంపదలన్?"

ఆ. మూలఁ గూరుచున్న వాలి యంతట లేచి
వానివంకఁ గడు నవజ్ఞఁ గనుచు
"నీ దశాస్యమృగము నేఁ దెచ్చి యిచ్చితి
నాటబొమ్మగా మదాత్మజునకు."

క. అనవుడు మౌనముతో నిం
దనుకం గూర్చున్నవాఁడు దాశరథియుఁ బ
ల్కెను; "నే నీ వాలిని నా
ధనువున కెరఁ జేసికొంటి దర్పము వాయన్.

ఆ. అట్టు లగుట నేన యధికతరుండను"
ననుడు నాలకించి యట నొకండు
కావిపుట్టములను గట్టిన జడదారి
లేచి రామచంద్రుఁ జూచు చనియె.

మ. "పరమాత్ముండగు నీ మహామహుని
నిర్బంధించితిన్ బట్టి; నా
చెఱఁ దప్పించుక పాఱిపోవుటకుఁ
జేసెన్ యత్నముల్ కొన్ని: యే

మఱికే రేయుఁబవళ్లు వేకనుల
స్తంభంభాత్మఁ గల్పించితిన్;
మరి నాకన్నను మద్గృహీతుఁ
డధికుండా ? సుంత యోజింపుఁడా !"

చ. అనవుడు నొక్కరేని
నెదురాడకపోయిరి కాదటంచు డా
నిని; దనకన్న నాతఁడె
యనేకగుణంబులఁ బెద్దటంచుఁ దోఁ
చెను బ్రతివానికిం; దుదికి
సిగ్గున వాల్చిరి మోము లెల్లవా
రును స్వమహత్తరత్వ మది
రూపఱఁ జీఁకటివోలె వెల్గుచేన్.

## ౩. సన్యాసిరాజు

మ. ఇది యిక్ష్వాకులనాఁటిమాట ; యొక భూ
మీశుండు నిస్సంతుగాఁ
దుదినొందం, బువుదండఁ బట్టి గజరా
ట్తుండంబుపైనుంచు వా
ర్తదమాత్యుల్ ; కొనిపోయి యెవ్వనిమెడన్
దానిన్ సమర్పించు న
య్యది, వానిన్నభిషిక్తుఁజేతురు
తదీయానంతరీయుండుగాన్.

మ. కరి తుండంబునఁ బూలమాలఁగొని
 వంకల్ వాఁగులుండాఁటి, పె
న్గిరులుం గాననముల్ క్రమించి, యొక
 చక్కిన్ బ్రహ్మతేజంబుతోఁ,
బరశాంతాకృతితో, జటావితతితో
 భాసిల్లు సన్న్యాసి ద
గ్గఱ నర్పించెను దద్గళంబున
 కలంకారంబుగా దానినిన్.

ఆ. దానివెంటఁ జన్న తత్సచివాళి యా
మౌనియడుగులకు నమస్కరించి
వచ్చినగరమునకుఁ బట్టంబుఁగట్టుకో
విన్నవించుకొనిరి పెద్దబత్తి.

ఆ. అడిగె సన్న్యాసి "యేమిటీ బెడఁద ?" యనుచు ;
సంప్రదాయంబుఁ దెలిపిరి; జటి వచించె
"వలదు; సన్న్యాసినగు నాకు వలదు పుడమి ;
బంధముక్తుండ; నీ పునర్బంధమేల ?"

క. అనవుడుఁ బలికిరి మంత్రులు
"ముని ! యిది యీ రాష్ట్రమందుఁ బూర్వాచారం
బనవద్య మనుల్లంఘ్యము ;
నినుఁబోంట్లకుఁ దెలుపవలయునే ధర్మ?" మనన్

క. బదులాడని సన్న్యాసినిఁ
దదమాత్యులు వందిమాగధజయధ్వనులన్
బొదలెడు వాద్యంబుల సం
ప్రదాయసిద్ధముగఁ దెచ్చి రాజ్యంబునకున్.

ఆ. సింహపీఠంబుపై యథోచితము నిలిపి
పట్టమునుగట్టి; రతఁడలి ప్తతను వారు
సలుపుకార్యంబు లన్నియు సాక్షివోలెఁ
గాంచుచుండెను గొనకయుఁ గౌతుకంబు.

౨

మ. ప్రతివేశక్షితినాథుఁ డొక్కరుఁడుఁ డా రాజ్యంబుపైఁ గన్ను వే
సి తఱింజూచుచునుండె మూషికముకై చెంతన్ బిడాలంబనన్
అతఁ డాలించి ప్రశాంతతేజుఁడగు సన్న్యాసిక్షితీంద్రుం గుఱిం
చి తటాన న్నవితర్కితంబుగఁబడెన్ సేనానికాయంబుతోన్.

గీ. ప్రాలిమంత్రులు సన్న్యాసిరాజుమ్రోల
దండయాత్రను గుఱిచి యాతనికిఁ దెలిపి
"యరినెదుర్కొన దేవ! మా కానతిమ్మ!
చెండి చీఁకాకుపఱతు మాదండు నెల్ల."

ము. అన, సన్న్యాసిమహీవరుండు విని
"యేలా ? వాఁడు దండెత్తి వ
చ్చెను ? గీడేమొనరించినార ?" మని
పృచ్ఛింపంగఁ దన్మంత్రు లి
ట్లని "రా జేఁడు బకాసురుండన
బుభుక్షాయత్తుఁడై లాఁతి నే
లను జూచుంగబళింపఁగా; నతనిఁ
గూల్పన్ మాకు నిమ్మానతిన్."

క. అనవుడు సన్న్యాసివిభుం
డనె "వానినెదుర్కొనంగ నరుగకుఁడా జే
నిని రానిం; డిమ్మ్యేడకుం
గానిపోవఁగనిండు వాని కోరికదీఱన్."

క. ప్రతివేశక్షితినాథుఁడు
ప్రతిరోధములేనికోట శ్వానముఁబోలెన్
అతివేగంబునఁ జొరఁబడి
యతికడకు సరాసరిగఁ బ్రయాణంబయ్యెన్.

క. అరిషడ్వర్గము గెలిచిన
పరంతపు, డరిందముండు; వదనంబున శాం
తరసంబు వెల్లివిరిసెడు
ధరాధిపతిఁ దఱిసి యనె నతం డీరీతిన్.

గీ. "ఓయి! వచ్చితి నీతోడ యుద్ధమాడ;
రమ్ము! లేకున్న రాజ్య మర్పణ మొనర్చి
పొమ్ము!" నావుడుఁ బెద్దధార్ష్ట్యమ్ముతోడ,
రాజసన్న్యాసి చలియింప కోజఁ బలికె.

3

శా. "అన్నా! యేటికి యుద్ధమాడ నిదిగో!
నర్పింతు రాజ్యంబు సం
పన్నం; బేల్కొను మీవె నాకు వల; దీ
బందీ విముక్తుండనై
విన్నాణంబుగఁ గొండవాఁగుదరులన్
వృక్షావళిచ్ఛాయలన్
కన్నుల్ కానఁగలేని యీశ్వరుని
సాక్షాత్కారముం బొందుదున్."

ఆ. అనుచు మైలపాఁత నటుత్రోసినట్లు స
న్న్యాసిరాజు రాజ్య మతనికిచ్చి
బరువుదీసినట్లు వడివడిఁ జనుచుండఁ
జకితుఁడయ్యెఁ గాంచి శత్రురాజు.

క. మతిఁ దలఁచె "దృణప్రాయం
బితండు త్యజియింప రాజ్య, మేఁబశువువలెన్
గౌతుకక దానిం దినుటకు
నతితమముగ నాశపడితి ననపత్రపతన్."

ఆ. చల్లనీటివెల్లి జన్మజమూలములఁ ఛే
దించురీతి నీయతిప్రవరుని
శాంతమూర్తి నాయహంత నిర్మూలించె
మృదువు తీక్ష్ణ మనుట నెఱిఁగికొంటి

క. అరిషడ్వర్గము గెలిచిన
పరంతపుఁ డరిందముఁడగు వాని జయింపం
దరమే? మాదృక్షుద్రో
ర్వీరాపతుల? కిపుడు తెలివివచ్చెను నాకున్."

క. అని పశ్చాత్తప్తుండై
చనుచున్న యతీంద్రుపాద సరసిజములకున్
బ్రణమిల్లి క్షమార్పణ మిడి
తనరాజ్యం బొసఁగి యయ్యె దచ్ఛిష్యుఁడుగాన్.

క. తమరాజ్య భ్రంశము ని
క్కమంచు దిగజారిపోవఁగ నెడందలు దుః
ఖమునందు మునింగిన వా
రమాంత మెడగెదిగినట్లు లలరె రమాత్యుల్.

గీ. అర్థమయ్యె నెల్లరికి సన్న్యాసబలము ;
రక్తపాతంబులేని పెన్ రణము జరిగె;
రాజసన్న్యాసి లోకసంగ్రహము పొందె
రాజ్యయుగమేలెఁగాని వీతరాగవృత్తి.

# ౪. సత్సంగము

ఆ. కలఁడు భక్తుఁ డొక్కగ్రామంబున నొకండు
పాఁతగుడిసె; మైలపాఁత; చదర;
ముంత యొకటి; కుండబొచ్చె యొకండును
అతని కున్నయట్టి యావదాస్తి.

క. తలపైని జటాజూటము;
వెలిబూడిద యొడలిపై, బవిరిగడ్డముఁ, బూ
సలతావళములు నతనికిఁ
గల ధార్మికరాజ్యరక్షకములుబలంబుల్.

క. హరినామమె యాహారము,
హరినామంబే జలంబు, హరినామమె స
ర్వరుజాహర మౌషధమును;
బరగు నతఁడు పరమభాగవతుఁడని పొగడన్.

ఆ. సంజవేళ భజన సాఁగింప నాతండు
ఇరుగుపొరుగువార లరుగుదెంచి
వానితోడ వంతుపాటఁ బాడుచుండ్రు
ప్రొద్దుపోవుదాఁకఁ బెద్ద రొదగ.

గీ. ఎవ్వ రేవేవి తెచ్చిన నవ్వి యెల్లఁ
బంచిపెట్టును వచ్చినవారికెల్ల

నిస్పృహుఁడు; వీతరాగుండు; నిష్పాపోలెఁ
బరమపావనుఁడై యొప్పు భక్తుఁ డతఁడు.

గీ. వాని యా గుడిసెకు ముందు జరుగుచుండు
గ్రామపెద్దది యగు సౌధరాజ మొండు
స్మరుని వ్యాయామ గృహమది: స్వైరిణు లటఁ
చేయుచుంద్రు వ్యాయామంబు రేయుఁబవలు.

ఆ. ఆడుచుండు; వాఁడు పాడుచుండును; వ్రాగు
చుండు వారిఁగూడి; యొడ లెఱుఁగక
యఱచుఁ; గౌఁగిలించు వెఱవ కెల్లరి ముంచె;
పడును; లేచు; మరలఁ బడును; లేచు.

ఆ. భక్తుకడకు వచ్చువారెల్లఁ దనకతల్
కాంచుచున్నవారు; కాదిది సరి;
త్రోలివేయవలయు దౌలకు వీని న
టంచు వాఁడు నిశ్చయించె మదిని.

క. ఉసిఁగొలిపె నాతఁ డొక రూ
పసియగు జవ్వనిని వానిపై; కదిచని తా
విసరెను బాచిక లయ్యవి
సనేమిరా పాఱవయ్యె జతనముచేతన్.

ఉ. దాని పిసాళి నవ్వులును,
దాని యొయారపుఁ జూపు, దాని క్రొం

దేనెలు జాలువాఱు నుడి
తీరులు, దాని మనోజ్ఞ కంకణ
ధ్వానము, దాని ప్రఫుల్లవిలసి
తంబులు, దాని పయంటదిద్దులున్
వాని హృదంతరంబున
లవంబుఁ జొరంబడవయ్యె నత్తఱిన్.

ఆ. అతఁడు గనులుమూసి హరినామ సంకీర్త
నం బొనర్చుచుండె; నాఁటి విసివి
ప్రొద్దువోవఁ జాల నిద్దుర కాఁగక
యావులించుకొనుచుఁ దావుఁ జేరె.

ఉ. నిన్నటికన్న నెక్కుడగు
నీటుగఁ దన్ను నలంకరించి యా
క్రొన్ననఁబోఁడి శ్రీ శుకున
కున్ మరులెత్తఁగఁ జేయఁజాలి త
త్సన్నిధి కేఁగ నాతఁడు
ప్రసన్నతఁ గాంచి నమస్కరించి చే
సన్న నొనర్చి కూర్చొనఁగ
సాఁగె హరిస్మరణం బొనర్పఁగాన్.

క. వలఁబన్నె; మరులనొడ్డెను;
వెలంది పోకిళ్లపోయెఁ బెల్లుగఁగట్టా!

శిల చక్కిలిగింతలకును
బలె నాతనియెడఁద కలఁతవడ దలఁతియునన్.

క. అరసికుఁ డీతఁడు వ్యంగ్యము
స్ఫురింప దీతనికి వాచ్యమునఁ దెల్పుదు నం
చెఱిఁగింపఁ దెల్లముగఁ గో
ర్కి "రేపు ర"మ్మంచు దానికి నతం డనియెన్.

క, మఱునాఁడు రాఁగ జవ్వని
మరలన్ రేపనియె; రాఁగ మర్నాఁ డది తాన్
మరలన్ రేపనె; నివ్విధి
మరలన్ రేపం చతండు మగువం ద్రిప్పెన్.

చ. తుదికిఁ దలంచె నివ్విధి
వధూటి "విటుల్గడు నాదుపొత్తుకై
గొదగొనియుం; ద్రితండు
ననుఁగూడుటఁ గల్గు సుఖంబుకన్నఁ బె
ద్దదగుసుఖం బెదో మరగి
నట్లు కనంబడు; దానికై యొన
ర్చెద జతనంబు నీ మహితు
శిష్యజికంబునఁజేసి నేనునన్."

క. అనితలఁచి వ్రాలి యడుగుల
ననుతాపముతోడ వేఁడ నాతఁడు దానిం

గాని శిష్యురాలిగాఁ, బా
వనురాలినొనర్చి భాగవతినింజేసెన్.

## ౫౩. సృష్టికర్త బుద్ధిహీనుఁడు గాఁడు

క. ప్రతిభాశాలి కలఁడు పం
డితుఁడొక్కఁడు సర్వశాస్త్ర నిష్ణాతుండుం
గృతహస్తుఁడు, వాదములన్
'జితోఽస్మి' యనిపించు నెదిరిచే నిముసమునన్.

గీ. తన గృహారామమందు నాతఁ డొకనాఁడు
పెల్లు కనువిందుగావించు వివిధములగు
నలరుఁదీవలపందిళ్లు, ఫలతరువుల
మొత్తమును గన్చి వాహ్యాళిఁబోవుచుండె.

ఉ. చక్కని పూలరూపములుఁ,
జక్కని వానిపరిమళంబులున్
జక్కని వానివర్ణములు
స్వాంతమునంగని మెచ్చుకొంచు, వే
ప్రక్కకుఁబోయి భిన్నరుచి
స్వాదుఫలంబులవంకఁ గాంచుచున్
మిక్కిలి సృష్టికర్త
రమణీయము శిల్పముఁ బాడుచుం జనెన్.

మ. తలపైకెత్తికనంగ నల్లైసలఁ
గొల్తల్ వేయునట్లున్న శా
ఖలతోఁ, దుంగహిమాద్రి శృంగముఁ
గనంగానేమొ మిన్నెక్కు నౌ
దలతోఁ, జిన్నని పద్మరాగమణి
బృందంబట్లు శోభిల్లు పం
డులతో నొక్కవటంబు కన్నులకు
విందుంజేసె నవ్వానికిన్.

గీ. అలఁతి దానికిదౌల వ్రేలాడుచుండె
సన్నతీవకుఁ బెద్ద కూష్మాండకములు
వటమువంకను గూష్మాండవల్లివంకఁ
గాంచి క్రమ్మఱ నతఁడు చింతించె నిట్లు.

క. "మతిపోయె సృష్టికర్తకు
నతిమహితంబైన యీ వటావనిజమునన్
అతిసూక్ష్మఫలంబుల, నీ
లత నేతాదృశ బృహత్ఫలముల సృజించెన్.

గీ. అవకతవకలె వీని కార్యంబులెల్ల
లేనివానికిఁ బెద్ద సంతానమిచ్చు;
సలుపు నిస్సంతుఁ గలవాని; సంతరించు
రూపసిని నొక్క మహిషాసురునకు జగతి.

ఆ. నేనె సృష్టికర్తనేని వైషమ్యంబుఁ
దల్లివేరుతోడఁ బెల్లగించి
సముచితముగ వస్తుజాలంబు సంధించి
సృష్టి చారుతరము సేసియుందు."

క. అనుకొని యాకులపందిరి
యనఁ జల్లఁగ నున్న యావటావనిజము నీ
డను గూరుచుండె విశ్రాం
తినిఁ గొనఁగ నదే పదేపదే యనుకొనుచున్.

గీ. తన్నుఁ దెగడుట బిట్టల్గి ధాత వాని
బట్టతల మొట్టికాయను మొట్టినట్లు
ఎఱ్ఱనై యున్న యొక చిన్న మఱ్ఱికాయ
పడెను టప్పని పైనుండి వాతహతిని.

గీ. మొగముఁ జిట్లించుకొని హస్తమున శిరస్సుఁ
దడుముకొని యంతలో సిగ్గువడుచుఁ దలఁచె
"నెగ్గులాడితి నిస్సి! నే సృష్టికర్త
వాని తలఁపు లెఱుంగ నెవ్వరితరంబు?

మ. మతి నే నూహయొనర్చినట్టు లల
కూష్మాండ ప్రమాణంబు లీ
క్షితిజాతంబునకున్ ఫలంబులను
సృష్టింజేసియే యున్న బ్ర

హ్మ తగఁగ, నాతల తన్నిపాతమున
 వ్రయ్యల్వాఱియేయుండు నేఁ
డు; తలంపంగ నెవండు స్రష్టమది
 గుట్టుంజూడ శక్తుండగున్ ?

క. ప్రతిభావంతుండను నే
మతిపోయెను బ్రహ్మకనుచు మది ననుకొంటిఁ ;
ప్రతిభావంతుఁ డతండే ;
మతిపోయెను నాకె" యనుచు మఱిమఱి వగచెఁ.

## ౬. కలియుగారంభమునాఁటి కథ

క. కలరు కృషీవలు లిరువురు
దొలికాలమునందు సూనృతులుఁ, బుణ్యచరి
త్రులుఁ బరుల రత్నరాసులఁ
దలంత్రు మసిబొగ్గులుగ నెదల వారు బళా !

ఆ. తగవులాడుకొనుచుఁ దెగక వారొకతఱిఁ
దరిసి, ధర్మమూర్తి ధర్మరాజు
పేరుటోలగంబు, విన్నవించిరి తమ
తగవు నొక్కరొకరు మొగము ముడిఁచి.

క. పలికె నొకం డిటు "దేవా !
విలిచితి మున్నొక్క పొలము వీనికడను ; నే

వెలయిచ్చి ; పైరువిత్తం
దలంచి తగ దున్నుచుంటి దానిని నిన్నన్.

క. కనఁబడెను సువర్ణంబుల నిం
డిన పాత్రం బొండు దానినింగొని చని యా
తనితో 'నియ్యది నీదే ;
కొను' మంటిని ; గాని యెంతకుం గొనఁడయ్యెన్.

క. పిలిచితి నీతనియొద్దను
బొలంబుమాత్రంబె నాది; భువిఁగలపాఁతున్
పిలిచితినె ? వానిదే యది ;
'వలదు; కొన' నటం చితండు వలుకుచునుండెన్.

ఆ. స్వీకరించునట్లు చేయుము వీనిచే"
ననుచుఁ బాదయుగమునందు వ్రాలెఁ ;
బలికెనంత లాఁతివాఁడు "దేవర! యిది
న్యాయమగునె? చెప్పరయ్య ! మీరు.

గీ. వెలిగ గర్భస్థపిండంబు విక్రయింత్రె ?
యొక్క యావునె? లోపలనున్న పాఁతు
వెలిగ నమ్మదురే నేల? విలుచువాఁడు
స్వత్వము వహించియుండు సర్వస్వమునకు.

ఆ. నాదికాని దాని న్యాయంబె కొనుమంట ?
యిట్టి పాపమును సహింపఁజాల ;

మానిపింపుమయ్య! వీనిచే నీకృత్య"
మనుచు దీనవృత్తి నడుగులఁ బడె.

క. విని యిరువురి వాదంబులు
జనపతి ధర్మజుఁడు పలికెఁ "జనుఁ డిప్పుడు మీ;
ర్చను దెండు! పదిదినాల్ కడ
చిన పిమ్మటఁ దగవు దీర్పుఁ జెప్పెద" ననుచున్.

ఆ. కొలువుకూటమందుఁ గల పెద్ద లడిగిరి
"అంత గడు వదేల" యని: నృపుఁడనెఁ
"గలియుగంబు వచ్చుఁ గందురు మీరలే
వీరి చిత్తవృత్తి తారుమారు."

౨

మ. కడవంగాఁ బదినాళు లా యిరువురున్
క్ష్మానాథునిన్ డాసి; ర;
ప్పుడు తత్క్రేతను జూపి విక్రయికుఁ
"డో భూపాల! యాలింపు! ముం
బడమిన్ వీనికి విక్రయించితినిఁ;
దమ్భూమిష్ఠ విత్తంబు నీ
తఁడు స్వీయంబె యటంచుఁ గైకొని
తగాదా పెట్టుచుండెం గడున్.

గీ. నేలనే విక్రయించితి నిధిని గాదు;
నేలతోపాటు హరియింప నిధిఁ దలంచె;

నీ పిశాచి, యీ ధూర్తుఁ డీ పాపి; నాకు
న్యాయ మొనరింపవే?" యని యడుగులంటె.

చ. పిదపం గ్రేత వచించెఁ "బండ్లు వెలిగా
వృక్షంబు నెందేని న
మ్మెదురే? యవ్విధమైన బేరముల నే
మూర్ఖుండు గావించు? నీ
విధినే కా దొక గ్రుడ్డిగవ్వయయినన్
నే నీయ నిద్దానిలోఁ
బదివేలేఁడులు దల్లక్రిందుతపముం
గావించినన్ వీనికిన్.

ఆ. కోలుపోయినాఁడు నేలపైఁగల స్వత్వ
మెపుడు నాకు నమ్మె నపుడె వీఁడు;
రాతిముక్కలున్న రత్నంబు లున్నను
క్రేతవగునుగాని లాఁతివగునె?"

క. అనె; నిటు "లా నిధి తనదే;
తనదే" యని కీచులాడు తద్యుగళంబుం
గని "నా తీర్పును మీరలు
వినుదురె?" యన వారలనిరి "విందు" మటంచున్.

క. పలికెను భూపతి యంతం;
"దెలుపుఁడు! మీ మీదు సంతతింగూర్చి" యనన్

దెలిపె నొగిఁ గ్రేత కన్యక
గల దని; విక్రేత సుతుఁడు గల డని తనకున్.

ఆ. అంతఁ దీర్పుఁ జెప్పె నా ధర్మపుత్త్రుండు
"వియ్య మొందుఁ డీరు; పిల్లతండ్రి
యౌతకముగ బిడ్డ కప్పనం బొనరించు
నేల దొరకినట్టి నిధి" నటంచు.

క. జనపతి తీర్చిన తీర్పది
యనుకూలంబుగ గ్రహించి యా యిరువురుఁ దో
డనె మంచిముహూర్తంబున
నొనరించిరి పాణిపీడనోత్సవ మెలమిన్.

## ౭. దశమస్త్వమసి

క. పదిమంది యొక్కపరి కం
ఠదఘ్నముగఁ బాఱుచున్న నది నెట్లో దాఁ
టి దరిం జేరి యనుకొనిరి
పదుగురమును దాటినామె? పదిలంబనుచున్.

ఆ. విడిచి తన్ను లెక్కవేయం దొడంగె నొ
క్కొక్కరుండు; తగ్గె నొకటి పదికి
నెన్నితూర్లు లెక్క యిడిన తొమ్మండ్రు రే;
మునిఁగె నదిని నొక్కఁడని తలఁచిరి.

క. "కట్టా ! కట్టా !" యనుచుం
గట్టం గన్నీరు కాల్వఁగా నచ్చట మి
న్నుమ్మట్టఁగ నాక్రందనములు
పెట్టుచు దశముం గుఱించి వీఱఁడులవలెన్.

ఆ. ఉన్న సమయమందు నొక్క విద్వాంసుఁ డా
దారిఁ జనుచు వారిఁ దఱిసి యరసె
వార లేడ్పుమాని వానిముందర లెక్క
వేసికొనిరి మరల విడిచి తమ్ము.

క. కని వారల యవివేకము
మనీషి నవ్వుకొని యెదఁద "మఱచితి రీరల్
గణియించుకొంట మీవ్య
క్తిని; దశముండగును మీ ప్రతివ్యక్తి" యనన్.

గీ. లెక్కవేసికొనిరి యొక్కొక్కరును దన్నుఁ
గలిపి "పదుగురమును గల" మటంచు
విశ్వసించి చింత వీడి కృతజ్ఞత
బుధుని కెరగి వెడలిపోయి రెటకొ.

## ౧. ఒకానొక సన్న్యాసి కథ

క. చురచుర చూచును పతిపైఁ;
జిఱచిఱలాడుఁ గనిపెట్టి చినచిన దొసఁగుల్;

నిరతంబు భర్తయొక్కఁడు;
నరకుఁగొనక వీనిఁ బతిని సతి సేవించున్.

క. బెదరించును "సన్న్యాసము
నిదిగో నే స్వీకరింతు నీ నాఁ"డనుచున్
సుదతి గడు బేలయగుటం
బదములఁబడి తప్పునైఁపఁ బ్రార్థించుఁ గడున్.

క. పొరుగింట నున్న చదురాల్
పరికించుచునుండె వీని ప్రకృతిని; నొకనాఁ
డరుదెంచిన యాసతి కవ
సరముం గనిపెట్టి యొక్క సలహా యిచ్చెన్.

క. మఱునాఁ డతండు చిన్ని య
పరాధమును జూపి భార్యపై "నీతోఁ గా
పురమును జేయు టరిది స్వీ
కరింతు సన్న్యాస"మనుడు గరిత 'సరె' యనన్.

ఆ. శిరసు ముండనంబు సేయించుకొని కావి
పుట్టములనుగట్టి దట్టముగను
మేన వెల్లవేసి మెడఁదాల్చి రుద్రాక్ష
తావళంబు లయ్యెఁ దపసి యతఁడు.

గీ. పోయి భాగీరథీతీరమునకుఁ గనులు
మూసియుండె బకధ్యానమున నతండు

తైర్థికుండొక్కఁడేని నాతనిఁ గనండు
పిలువరై రెవ్వరును వీని భిక్షకొఱకు.

ఆ. ప్రొద్దు దిరిగె; నయ్యె మూఁడు జాములు; కాని
కడుపు గాలుచుండెఁ గన రెవరును;
బ్రొద్దుగ్రుంకెఁ; గ్రమ్మెఁ దద్దయుం జీఁకట్లు;
విసివి యచటు బయలువెడలె నతఁడు.

ఆ. చనియతండు గొట్టెఁ దనయింటి తలుపును
"నెవరు వా" రటంచు యువతి యడిగె
బదులువలికె వాఁడు "సుదతి! సన్న్యాసి నం".
చామె వాని కంఠ మాలకించి.

ఆ. "ఇది గృహస్థనిలయ; మిందు సన్న్యాసికి
తావులేదు; నీదుదారిఁ బొమ్ము
మఠములకునొ? యాశ్రమములకో?" యనుడు "స
న్న్యాసిగాను; నీగృహస్థు నేను.

ఆ. మాడుచుండెఁ గడుపు కూడున్న బెట్టుము
చలిదియన్నమున్నఁజాలు నిపుడు;
హాస్యమునకుఁగూడ నన సన్న్యసింతునం"
చనుచు వేఁడె దైన్యమున నతండు.

# ౯. శివాజీ గర్వనిర్వాపణము

గీ. ఘనమహారాష్ట్ర వీరశేఖరుఁడు ఛత్ర
పతి శివాజి యశోరాజి పరనృపతుల
వెంటవెంట వినిర్జించి వెచ్చపఱచి
కొన్నధనముల నిర్మింపఁ గోటఁ గడఁగె.

క. తన తేజమును శివాజీ
ఘనీభవింపంగఁ జేయఁగడగిన పగిదిం
గొనసాఁగుచుండె నయ్యది;
పని సేయఁగ దినదినంబు భటకోటి దగన్.

చ. అతనికిఁ దోఁచె నొక్కదినమందు
మనంబున "నింతమంది నే
మనుచుచు నున్నవాఁడ; బహుమాన
మొనర్తురు వీరలెల్ల జీ
వ నదుని గాఁగ న" న్ననుచు; వాని
గురుండు సమర్థ రామదా
సున కిది గోచరించె మదిఁ; జూడఁగ
వచ్చెను సంస్కరింపఁగన్.

క. చనుదెంచిన యాచార్యుని
వినయవిధేయతల మ్రొక్కి వెంటం గొనిపో
యెను గట్టుచున్న యా కో
టను జూపింపంగ నుత్కటంబగు బత్తిన్.

ఆ. కాంచి రామదాసు గడుఁ గడు శ్లాఘించె
"మనుచుమంటి వింతమంది నీవు
ఈయకున్న వీర లేమయియుందురో ?
వేల్పు వీవ కాక వేఁడు గలఁడు ?"

చ. అనవుడుఁ బొంగిపోయె హృదయంబున
"నంతటివాఁడ నౌదు నే"
నసుకొని; కాని పైకి వినయంబునఁ బల్కె
"నిదెల్ల దేవ ! మీ
కనికరపుం గటాక్షమునఁ గాదె" యటంచు,
గురుం దెజింగి యా
తని మదిగుట్టు ఱాయి నొకదానిని
వానికిఁ జూపి యిట్లనెన్.

ఆ. "దీనిఁ బగులఁ గొట్టుదే ?" యన బలిమిమై
సుత్తెతో నతండు మొత్తె దానిఁ
బెద్దకప్ప యొండు బెకబెక లాడుచు
వెడలె దానినుండి వెడఁగు దోఁప.

ఆ. దానిఁ జూపి రామదాసు తాఁ బ్రశ్నించె
"నోయి ! యిందు దీని కోగిర మిడి
నీరుపోసి మనుచువా రెవ్వ ?" రని; దానఁ
దెలివి వచ్చెఁ; దప్పు దెలిసికొనియె.

క. గురులజ్జాభారంబున
శిరస్సు వ్రాలిచి శివాజి చేసి ప్రణతి "నేఁ
బొరపడితిని మూర్ఖుఁడనై
గురూ! క్షమింపు" మని వేఁడుకొనె నడఁకువతోన్.

## ౧౦. గురువు - ఇద్దఱు శిష్యులు

క. గురుఁడు పిలిచి శిష్యులతోఁ
"బరికింపుం డెదుటనున్న పావురముల మీ
రిరువురు నొక్కొకదానినిఁ
బరిగ్రహించి కొనిపోయి వధియింపవలెన్.

క. మిము నెవ్వరుఁ జూడని దే
శమునం దీకృత్య మీరు సాధింపుఁ"డనన్
నిమిసమునఁ దీర్తు నేనని
తమకంబున నొక్కఁ డొక్కదానిఁ గొని చనెన్.

ఆ. పోయి దట్టమైన పొదలచాటున నిల్చి
పాఱఁజూచి లెస్స పదిదెసలను
నిశ్చయించి యిద్ది నిర్మక్షికంబని
సంహరించి తెచ్చె సరగ మగిడి.

గీ. ఆ ద్వితీయుండు గైకొని యరిగి తిరిగి
కానలం గోనలను గొండగవులయందుఁ

బెద్దకాలంబు క్రమ్మఱి పిట్టతోడ
గురువరేణ్యుని సన్నిధి కరుగుదెంచె.

గీ. వచ్చి వచియించె "గురుదేవ! దచ్చికడలు
గంటి; గుహ్యస్థలం బెందుఁ గాననైతి;
నెల్లతావుల నావంక కెవరొ నాకుఁ
గనఁబడక కాంచుచున్నట్లు కాంచితి" నని.

## ౧౧. గాఢభక్తి

ఆ. ప్రమిదఁ జమురు నింపి వత్తిడి దాని ము
ట్టించి తేరఁ బొరుగుపెంకి కరిగి
చిన్నపిల్ల యోర్త చేసాఁచె దీపిక
కంత బాలకృష్ణుఁ డటకు వచ్చె.

క. కనుచుం దదేకదృష్టి న
తనిఁ జిత్తరుబొమ్మవోలెఁ; దన్మయియై వ
త్తినిఁగాక దీపమునకుం
దన వ్రేల్ముట్టించె నవిదితంబుగ నకటా!

ఆ. ఎంతసేపటికిని నేతేరమికిఁ గన్య
జనని వచ్చె వెదకికొనుచు నటకు
వ్రేలు సగముదాఁక గాలెఁ; గాలుచునుండెఁ
గాంచి తల్లి పెద్దగా రుదించె.

గీ. జనని నేసిన యాక్రోశమునకు బిడ్డ
చెదర మది చూచుకొనియెను జేయి నపుడు
దెలిసె బాధయు నత్తఱిఁ; దెగడెఁ దనదు
ధ్యానభంగం బొనర్చిన తల్లిఁ బిల్ల.

## ౧౨. యోగి ప్రభావము

చ. మునుపొక దివ్యయోగ మహి
మ్ముండగు సాధువు పోయి రైలుస్టే
షనునకు మాష్టరుకా వినయ
సంపద గ్రాలఁగ మ్రొక్కి రైలునం
దన కుచితం బొనర్పఁ బయ
నంబును సమ్మతిఁగోరె "నేను సా
దును; దృణమేని లేదు; దయతోఁ
బయనింపఁగనిమ్ము" నావుడున్.

క. "పోరా! బికారి! పోపో!
తేరఁగఁ బయనింపవచ్చితివె? నీ కొఱకై
యీ రైలు వేసిరే?" యని
దూఱుచు దవ్వులకు భటులతో గెంటించెన్.

క. చేయునదిలేక పాపము
పోయి యతం డట సమీపమునఁ గల వృక్ష
చ్ఛాయం గూర్చుండె నపుడు
మ్రోయించిరి గంట రైలు పోవంగ భటుల్.

ఆ. రైలు కదల, వేసి యీలను, బచ్చ జెం
డాను జూపె గార్డు; డ్రైవరంత
మరలు ద్రిప్పెఁ; గదలమానె రైలేలొకో ?
సర్వ యంత్రములును సరిగనుండె.

గీ. తిరిగి తిరిగి యతండు యత్నించెఁ గాని
కదలదయ్యె రవంతేనిఁ; గబురుపంప
నటకు వచ్చి హేమాహేములయిన యంత్ర
చణులును బరీక్ష సేసిరి చాలతడవు.

ఆ. మొండికెత్తె రైలుబండి కదలనంచు;
నేమి సేయఁ దోఁచ దెవ్వరికిని;
నచట మూఁగియున్న యాజనంబుననుండి
పలికె విజ్ఞుఁ డొకఁడు వారితోడ.

మ "కనుఁడా వృక్షమునీడ దివ్యముని
యొక్కండుండె; నాతండు ప్రా
ర్థనసేసె న్నుచితంపుఁ బైనమునకై
రైల్మాష్టరు: స్నితఁ డా
తని గెంటించె; నతండు కూర్చొనక
యంత్రం బిద్ది మీరేమి సే
సిన, నెన్నాళ్ళకునుం జలింప; దతనిన్
సేవించి రప్పింపుఁడీ!"

ఆ. అనఁగ నవ్విరి కొందఱు జనులు; మఱియుఁ
"చింత కాయలు రాలునే మంతరముల"
కనిరి; తుదికెట్టకేలకు నతని డాసి
రైలుమాష్టరు కాల్మ్రొక్కె రైలు నెక్కె.

గీ. వచ్చి యాతఁడు గూర్చుండె; బండి గదలె;
నవ్వియే యంత్రములు; డ్రైవ రతఁడె; యిద్ది
యశ్రుతచరం బటంచు మున్నతనిఁ గూర్చి
నగిన యయ్యలె చేతులు మొగిచి రపుడు.

## ౧౩. చతుశ్చోరము

చ. నలువురు చూఱకారులు ధనంబు
ఘనంబుగ దోఁచి పెక్కు తా
వుల నది పంచుకోఁదలఁచి
పోయి రొకానొక కాన; కప్పు డాఁ
కలిగొని వారినాయకుఁడు
"క్రన్నన మీరలుపోయి యూరిలో
పలి, కశనంబుఁదెండు; కడు
వైశమ రం" డని పంచె నిర్వురన్.

గీ. వారలేఁగుడు మిగిలినవారిరువురు
మంతనము లాడుకొని రిట్లు; "మనము వారి

పీఁచమడఁచిన లభియించుఁ బెద్ద పెద్ద
భాగ మిర్వురి కిది సేయవలయు" ననుచు.

గీ. నాయకునికి భోజనంబుఁ దేఁబోయిన
వారలొక్కచోటఁ గూరుచుండి
యీవిధంబుగానె యెంచి విషాన్నంబుఁ
గొని మగిడి యడవికిఁ జనిరి వేగ.

గీ. నాయకుఁడు వేఱొకండమాంతముగ మూఁకి
దగ్గరికివచ్చినట్టి యిద్దఱిపయిఁ బడి
బెబ్బులులు మేఁకలను గావువేసినట్లు
పిలుకుమార్చిరి త్రుటిలోన బెట్టిదముగ.

గీ. అట్లు మడియించి పీరిద్దఱా విషాన్న
మారగించిరి తద్దయు హర్షపడుచు
డింకఁగొట్టిరి; తానొక్కటిం దలంప
దైవము మఱొక్కటిం గటా! తలఁచుఁగాదె.

## ౧౪. కీడు మేలునకే

౧

కం. కలఁడు మును విక్రముండను
బలవంతుఁడు బిరుదుమగఁడు; బహుసాహసి; భూ
తలపతి; యజితుండను మం
త్రి లలాముఁడు రాజభక్తి నిష్ఠుండుఁ దగున్.

కీడు మేలునకే

ఆ. అతఁడు గరుడుగట్టినట్టి సౌశీల్యంబు;
పోఁతవోసినట్టి పుణ్యచయము;
ప్రాణమైన దైవభక్తి; యయ్యజితుని
కతఁడె సాటియందు రవని జనులు.

క. తన కేకీడు దటస్థిం
చిన మేలునకంచు విశ్వసించును వచియిం
చును లాఁతుల కవ్విధమున
మనంబునం గించఁగొనఁడు మాత్రకొలఁదియున్.

౨

క. కలఁడొకఁడు జేనితమ్ముఁడు
కులఘ్నుఁడు గృతఘ్నుడుఁ నతికుటిలుండునుఁ; గో
తులుద్రవ్వ సోదరుని రా
జ్యలక్ష్మి హరియింపఁ దలఁచి యశ్రాంతంబున్.

క. తనత్రవ్వినగోఁతనె యా
యనుజుఁడు పడఁగలఁడటంచు నాతని యెత్తుల్
కనుచుఁ బ్రతిక్రియ సేయును
గొనసాఁగఁగనీక మంత్రి కోవిదుఁ డెపుడున్.

ఆ. మట్టుపెట్టుకున్న మంత్రిని దనయాట
సాఁగదంచు భ్రాత స్వాంతమందు
నిశ్చయించె; వీనినింబట్టి యీయంగ
నజితమంత్రి నిశ్చయం బొనర్చె.

3

ఉ. ఖండితమయ్యె దైవికముగా ధరణీ
పతి చేతి(వ్రే; లమా
త్యుండదిచూచి "దేవ ! యిదియున్నొక
మేలునకే" యటన్న భూ
పుండు (వణంబుచేత వ్యథఁబొందుచు
నుంటను మంత్రిమాట యా
పుండునఁజల్లు కారమయి భూరి
వ్యథం గలిగించె వానికిన్.

ఆ. ఉపశమించినట్టులుండును బాధ యా
శ్వాసవచనములను బలుకఁ గొలఁది
సత్యమైనఁ దాదృశంబైన పలుకున
నెఱియకుండు నెవని హృదయ మిలను ?

శా. ఆమాటల్ విని విక్రముండిటు
పరీహాసంబుఁ గావించునే ?
యీ మూర్ఖుం" డని కన్ను లెఱ్ఱవడఁగా
వీక్షింపఁ, దతోన్దరుం
డా మాయావి ఖలుండు దగ్గఱి
యసత్య ప్రాయముల్ దోషముల్
తోమెఱ మంత్రిశిరస్సుపైఁ బులిమి;
ధూర్తుల్ రంధ్రవీక్షారతుల్.

ఆ. మండుచున్న మంట యెండుకట్టెం బోలె
వాని కొండియముల తేని కినుక
నింగిముట్ట మంత్రినింబట్టి బంధించి
బంది నిడఁగ నిచ్చె భటుల కాజ్ఞ.

ఆ. "దున్న యీనె నన్న దూడను దొడ్డిలోఁ
గట్టివేయు" మనెడు జ్మాధవులకు
నిదియుచిత మనుచిత మిదియన్న సద్వివే
చనము పొడము నొక్కొ? జగతియందు.

ఆ. మంత్రిసత్తముండు క్ష్మాపతి యానతి
విని స్మితం బొనర్చి యనియె నిట్లు
"కీడుగూడ మేలుకాకే తటస్థించుఁబో
ఈశ్వరుండు కఠినహృదయుఁ డగునె?"

౪

మ. సచివస్థానము నాక్రమించుక గవాస్య
వ్యాఘ్రు మా భ్రాత తా
నచిరం బన్నను మన్ననర్ప మృగయా
వ్యామోహ మెక్కించి దు
ష్టచరవ్రాతము తోడుగా నతని
దట్టంబై మహాశ్వాపద
ప్రచురంబై తగు కాననంబునకుఁ
బంపంబోయె నుత్సాహియై.

గీ. అనుచరవ్రాతమును దాఁటి యతఁడు వేగ
దుర్గమారణ్యసీమల దూఱిదూఱి
పెద్దయుం బ్రొద్దు వేఁటాడి బిట్టు సొలసి
క్షితిరుహచ్ఛాయయందు నాసీనుఁడయ్యె.

ఆ. దృప్తసింహ మొక్కఁ డేతెంచుచుండె మూ
ర్తీభవించినట్టి మృత్యువువలె
పిడుగుఁబోని పెద్ద బెడిదంపు గర్జతో
వసుమతీవరేంద్రు ప్రాంతమునకు.

గీ. ఆతఁ డూపిరి బిగఁబట్టి హస్తములను
బాదములఁ జాఁచి పడెఁ గొయ్యఁబాఱి నేల
తఱిసి కేసరి మూచూచి యరసి చేయి
మొండి వ్రేల్చూచి తలఁచె "నీతండు చచ్చె.

ఆ. ఏ మృగంబొ? వీని యీ వ్రేల్కొఱికివేసె
నిస్సి! ఇస్సి!" యనుచు నేగెఁ దిరిగి,
దాని పోకఁగాంచి ధరణీవిభుఁడు లేచి
చావు దప్పె ననుచు సంతసిల్లి.

క. తన మొండివ్రేలె తన్నున్
మనిచెన్ నేఁడంచుఁ దలఁచి మంత్రివచనముల్
మనసునకు రాఁగ గ్రహియిం
చెను దనదే తప్పటంచుఁ జింతయు నొందెన్.

ఆ. బయలువెడలి యచటు వచ్చుచు శిబిరంబు
వంక, జేఁడు భటుల పలుకులు విని
తన్ను మన్నిఁ గొనఁగఁ దమ్మని తంత్రంబుఁ
దెలిసికొనియెఁ దేటతెల్లముగను.

చ. తఱియక వారిఁ, బట్టి పెడవారిని
విక్రమభూవరుండు దా
నరిగియు రాజధానికి మహాపృతనా
పతిఁ బిల్చి తెల్పి సో
దరుని కుతంత్రమెల్ల "వడిఁ దారొకని
వారిని ముట్టడించి వే
చెఱ నిడు" మంచు నానతి వచించెను
బంపెను దక్షణంబునన్.

౨

చ. మఱుసటినాఁడు జేఁ దఱితు
మంత్రివరున్ విడిపించి బందినిం
దఱిసి కవుంగిలించుకొని "తప్పు
క్షమింపుము ! నీదు మాటలం
బొరపడితి న్నపార్థముగ; మోస
మొనర్చెను నాదు దుష్ట సో
దరుఁ" డని తెల్పి వానిదగు తంత్రము;
మంత్రిపదం బొసంగుచున్.

క. బహుమానించెను మంత్రికి
మహితంబగు ధనపుమూట క్ష్మాపతి; పిదపన్
మహిపతి యడిగెను "మత్కృత
మహితము నీకేమి లాభ మాపాదించెన్ ?"

చ. అనవుడు మంత్రి యిట్లనె: "ధరాధిప !
చాలదినాలనుండి నా
మనమునఁ జింత సేతు సురమందిర
నిర్మితికై ; ధనంబు లే
మిని విరమించితి; న్నిపుడు
మీర లొసంగిన ద్రవ్యరాశి నా
పని ముగియింతుఁ; గి డిటులు వచ్చెను
నాకును మేలుకే సుమీ !

క. తెలియదు భగవంతుని చేఁ
తల యర్థ; మపార్థమై యెదం దోఁచును లో
కుల; కతఁ డెది కావించినఁ
గలదాయతి యంచు నమ్మఁగావలయు నృపా !"

## ౧౫. దారా

క. మును పారసీక దేశం
బున 'దారా' పేరి శూద్రపుత్త్రుఁడు ఋజువ

ర్తనుఁడు సరళస్వభావుం
డనవద్యుఁడు బుద్ధిశాలి యలరుచునుండెన్.

గీ. అతఁడు విద్యలు మొలకెత్తినట్టి చవుడు;
ఆభిజాత్యవాసనలేనియట్టి పువ్వు ;
అగును శ్రీ వెలివేసినయట్టివాఁడు
గాని సద్గుణ సంపత్తిఁ గ్రాలువాఁడు.

ఆ. కులముఁబట్టి వాఁడు గొంచెపువాఁడైన
గుణముబట్టి యయ్యె గొప్పవాఁడు ;
వానికీర్తివల్లి ప్రాఁకి వీథులఁ బల్లె
లల్లుకొనియె దేశ మెల్ల మెల్ల.

ఆ. పారసీకరాజు వానిఁగూర్చి యెఱింగి
పిలువఁబంపి తనదు కొలువాసంగెఁ
బదయు మన్ననలను బడమి గుణంబులె
కాదు కులము; ధనము గాదుగాదె !

క. మెలమెల్ల నెదిగె నాతఁడు
గొలువున వామనునివోలెఁ; గొన కాతఁడు భూ
తలపతిమంత్రిపదంబును
విలుచుకొనియె శ్లాఘ్యవృత్తి వెల నిచ్చి తగన్.

ఆ. పెద్దవానిఁజేసిఁ పెఱసేవకులపైని
శీతకన్ను వేసె క్షితివరుండు

డాన వారు వానిఁ దఱిఁజూచి గద్దె దిం
పంగ వలయునంచుఁ బ్రతినఁ గొనిరి.

క. క్షితిపతి విస్రబ్ధుండై
యతని చరిత్రంబునందు నంపెను దనకుం
బ్రతినిధిగా నేలఁగ న
న్యతమంబగు రాష్ట్రమునకు నక్కాలమునన్.

క. తఱివేచి తేనిమనసును
విఱువంగాఁ గాఁచియున్న పెద్దలతని డ
గ్గఱి చెవికెక్కించిరి త
చ్చరితం దలక్రిందు సేసి సత్యేతరముల్.

శా. "లంచంబుల్ తినుఁ; బన్నులెక్కువ వసూ
లావించుఁ బీడించి; చే
యించుం దద్దయ వెట్టి చాఁకిరినిఁ
గా నేనీక, తార్మారు సే
యించుం జూడఁగలెక్క : లివ్విధి నతం
డెంతేని ద్రవ్యంబు నా
ర్జించెన్; భారతమంతయూ నతని
చారిత్రంబు వర్ణించినన్.

మ. తనతోడం గొనిపోవు నెచ్చటికి
నాతండేగు నచ్చోటి కా

ధనపేటి; న్నెడఁబాసి యుండఁ డెపుడుఁ
దానిఁ క్షణంబేని రే
లనె యేకాకిగ దానినిం దెఱచి
చాలా ప్రొద్దు లెక్కించు; నీ
చనవుం గైకొని చంకకెక్కె నతఁ డీ
చందంబునఁ భూపతీ!

క. మీ రేగి యకస్మాత్తుగ
'దారా'ను బరీక్ష సేయఁ దగునిఁక; మా వ్యా
హారమునఁ గల్ల నిజములు
మీరలె గ్రహియింతు" రన్న మేకొనె విభుఁడుఁ.

చ. జనపతి యొక్క నాఁడు నడిచప్పుడు
లేని నిశీథమందు నా
తని నిలయంబు సొచ్చి తనదగ్గరఁ
బెట్టిన పెట్టెతోడఁ గూ
ర్చొనిన యమాత్యునిం గనఁగఁ,
యతండును లేచి విస్మయం
బున నెదురేగి తెచ్చెను; నృపుం
డనియె న్నచట న్నిషణ్ణుఁడై.

ఆ. నిదురఁ ద్రోసిపుచ్చి నిష్ఠఁ గోశంబు ర
క్షించుచుంటి రేలఁ జెంత నిలిపి

ఎంత మొత్తముండె నీ పెట్టెఁ జూపుదే ?
అన్యథా తలంప కడిగితి ననె."

క. అనవుడు గ్రహించి ప్రభు మది
గనఁబఱచెం దెఱచి చందుకా పెట్టియ నా
తని; కత్తఱి కచ్చటికే
చనుదెంచిరి రాజభృత్య జనులును మెల్లన్.

ఆ. చినిఁగి తూట్లువడియుఁ జెడు గొలుగొట్టుచు
దుమ్ముగొట్టియున్న దుస్తొకండు
వెలికిఁ దీసి చూపి పెట్టియ బోర్లించెఁ
గాని రాలదొక్క గవ్వయేని.

క. వెఱఁగువడి యెల్లవారలు
పరికించుచునుండ నతఁడు పలికెను "రాజా!
ఎఱుఁగుదువే దీనికతం
బురాతనంబైన నాదు భూషణ మిదిసూ!

క. నను నీవు నీదు కొలువునఁ
గొనకమునుపు దాల్చినట్టి కుడతా యిది ; దీ
నిని రత్నభాండమునువలె
ననయముఁ గాపాడుచుంటి నానాఁటఁగొలెన్.

ఆ. జేని కొలువుకతన భృత్యుని నెత్తికిఁ
గళ్ళువచ్చు; మనసు త్రుళ్ళిపడును;

పెద్దదగును నోరు; హద్దు దాఁటును గాలుఁ
గేలు; దీనికున్నఁ గీడిఁ కేమి ?

క. తనతొలుతటిదశ నెవ్వఁడు
మననం బొనరించుకొనునొ మాటికి నది వా
నినిఁ ద్రుళ్ళనీక మొట్టుచు
వినయవిధేయతల కభినివిష్టునిఁ జేయున్.

క. ఇందులకే దేవర! యీ
యందదుకులపాఁతఁ బెట్టియం బెట్టితి; దై
నందినము చూచుకొందును
వెం దిరిగి మఱతునొ? బూర్వవృత్తమను వెఱన్.

క. ధన మిందు దాఁచితిని సవి
యనుమానము గలిగి మీర లరుదెంచితిరో
యనుకొందుఁ బరీక్షింపఁగఁ
బనివడి నడిరేయి నేలవత్తురు మీరల్ ?

క. పెరిఁగితిఁ బెద్దగ నీ కొలు
వరినై బహుభోగభాగ్యవంతుఁడ నైతిన్
మఱవను నా ప్రథమదశన్
స్మరియింతును దాన నాకు శాంతి లభించున్."

★

# రామదాస కథావళి



## ౧. పుత్త్ప్రా పసిపార్ల్యము

మ. మును శౌద్ధోదని ధర్మమూర్తి నగరంబుల్
పట్టణంబుల్ స్వధ
ర్మ నిబోధం బొనరించుచుం దిరుగుచున్
రా, నొక్కచోటం బ్రమీ
తనిజాపత్యముఁ గేలఁ బూని యడుగుల్
తట్టాడఁగా, బాష్పముల్
కనులం గాల్వలు గట్టఁ దల్లి కడు నా
క్రందించుచుం దగ్గఱెన్.

ఆ. డాసి తత్పాదయుగముపై వేసి శిశువు
మోఁకజీలి, యెల్గురాల్పడఁ బొలఁతి యనియెఁ
“దండ్రి! యీ బిడ్డ బ్రదికింపు! దాసురాల
నీదు కడుపున మరల జన్మింతుఁ జచ్చి.

క. సేవించితిఁ దీర్థంబులు;
గావించితి వ్రతము లితనికై పెక్కింటిన్;
సేవించితి సిద్ధులఁ; దుది
కీ విధముగఁ బరిణమించె నెల్ల సుకృతముల్.

ఆ. ధన్యురాల; ఫలించె నా తపము లెల్లఁ
బంట పండిన దనుకొంటి బాలుఁ జూచి
మూఁడురోజుల ముచ్చటై ముగిసిపోయె
నాదు సంతోషమెల్ల ననాథదేవ!"

గీ. అనుచుఁ గడుపుచుమ్మలుచుట్ట వనరుచున్న
యొక యభాగినిఁ గని బుద్ధుఁ డొందివెతను
"అమ్మ! బ్రతికింతు నీబిడ్డ" ననుడు నాపె
యలఁతి యూఱడెఁ; గ్రమ్మఱ నాతఁ డనియె.

ఆ. "అమ్మ! పోయి యీపురమ్మునఁ జరియించి
తెమ్ము కొన్ని తండులమ్ము లడిగి;
తరతరములనుండి మరణం బెఱుంగని
వారిగృహమునుండి వలయుఁ జుమ్మి!"

గీ. అనుడుఁ గాళ్ళీడ్చుకొను చాపె యచటు గదలి
గడప లెక్కుచు దిగ్గుచు నవిరతముగఁ
గాళ్లు పడిపోవఁ దిరిగి యూరెల్లవచ్చి
రిక్తహస్తాలతోన యార్తిని వహించి.

మ. అనియెన్ "దేవర! యే గృహంబునను నే
యాచించినం దండ్రి చ
చ్చె నటంచుం, దమ తల్లి పోయె ననుచున్,
జిన్నారి పొన్నారి బా

లుని దైవం బది మ్రింగెనం చనిరి యా
లోఁగిళ్ళవా ; రెందునుం
గననైతిం బిడికెండు బియ్య" మని
యాక్రందించుచుఁ నిల్వఁగఁ.

గీ. అంత బుద్ధుండు వచియించె "నమ్మ ! కంటె
వసుధ 'జాతస్య మరణంధ్రువం' బటంద్రు
నహి ప్రతిక్రియ మృత్యువునకు నొకండు
ముందు వెనుకగ నెల్లరుం బోవువారె."

క. అనవుడు నా సాధ్వీమణి
కనుఁగవ విప్పాటినట్లు గని వెలుఁగును నా
తని యడుగులఁ బడి తన యా
ర్తిని దొలకుఁ బుచ్చి శిష్యదీక్షం గొనియెఁ.

## ౨. వాల్మీకి

ఆ. బ్రహ్మబంధు వొకఁడు బ్రాహ్మ్యంబుఁ బోఁద్రోలి
విధినిషేధములను వెలియొనర్చి
తిరుగుచుండు దేశద్రిమ్మరై తినరాని
తిండిఁ దినును ; ద్రాగు దేనినేని.

గీ. తగిలి వాఁడొక్క బోయత దానిఁ గొలుచు
నచ్చు బంగారు భూషలం దెచ్చియిచ్చుఁ ;

జెలువునిండారు సరిగంచుచీరలిచ్చుఁ;
మద్యమాంసంబు లిచ్చు సమ్మానముగను.

శా. దారుల్ కొట్టును; వేయుఁ గన్నములు;
మిథ్యావేషముల్ వేసి తా
వీరిన్ వారిని బుట్టవెట్టు; సిసులన్
బెల్లించి కొంపోయి పెన్
దూరం బొల్చుకొను న్నగల్; దినము
ధూర్తుండైన యవ్వాని కా
చారంబుల్ భగవంతుఁ దేర్పఁజెనె నీ
చందాన నన్నట్టిసీ!

గీ. దాని యెంగిలి కవణంబు, దాని నమలు
తమ్మలము, దాని త్రాగు మద్యము నతండు
మధురతరముగనెంచుఁ దన్మాననకయి
దాని కాళులనొత్తు; వస్త్రముల నుదుకు.

ఆ. అతఁడు క్రీతదాసుఁడై యిట్లు దానికి
నడిగినట్టిదెల్ల నానయించుఁ;
జేయుమన్నదెల్లఁ జేయు నా దొరసాని
వేసికొనెనొ యెట్టి విత్తనంబు?

శా. దారిం గాయుచునుండ నొక్కదిన
మాతండొక్కచో లోక సం

చారవ్యాపృతి నారదుండు మహతీ
స్కంధుండు విచ్చేయ నా
దారిన్, డగ్గరి యెత్తె దండమును ;
జ్ఞాతంబయ్యె నమ్మౌని కా
చౌరుం జూడఁగ వాని తొంటి కత
విస్పష్టంబుగా నెమ్మదిన్.

క. తలఁచె నతఁ డిట్టు లీతఁడు
"కులమున విప్రుండు; కాని క్రూరాచారం
బులచేఁ గిరాతుఁ డయ్యెను ;
మలశుద్ధింజేసి వీని మాన్యు నొనర్తున్."

క. అని తలఁచి వాని కిట్లనె
ముని "యోరీ! లేవు మూటముల్లెలు నా యొ
ద్దను; నే జోగిని; బూదియ
ఘనంబుగాఁ గలదు నీకుఁ గావలె నన్నన్.

చ. హితమును గోరి నీకు వచియించెద
నొక్కటి యెంతమందినో
హతుల నొనర్చి ప్రత్యహము
నంత ధనంబు గడించుచుంటి దు
ష్కృతములతోడ; నీ ధనము నెవ్వరి
కిత్తువొ వారు నీదు దు

ష్కృతమును బంచుకొందురొకో? పృచ్ఛ
యొనర్చితె యెన్నఁడేనియున్?"

మ. అన నచ్చోరుఁడు మౌని కిట్లనియె
"నా యర్ధాంగి కర్పించుచుం
దును నేఁ దెచ్చిన వెల్లఁ; బంచి
సగమందుఁ నాకు నర్పించుచుం
డును నా కోమలి; యేల పంచుకొన
కుండుఁ నాదు పాపంబు? నిం
దనుకం బృచ్ఛ యొనర్పనైతి; మది
కేతచ్చింత లేదింతయుఁ."

క. అన నారదుఁడనె "నిదిగో!
కనుమా హిమశైల మంత గలదిట నీ చే
సిన కలుషము; తత్ఫలముగ
ననంత దుర్జన్మములను బ్రాపింతువిసీ!

క. నీ యీ యనంతపాపము
నీ యిల్లాల్పంచుకొనునె? నే నమ్మనుజా!
పోయి యరసికొనిరమ్మా!
వేఁ; యే నీ హితుఁడసుమ్మ! వెడలు" మటన్నఁ.

గీ. ఆకసముఁ దాఁకుచున్న యాయద్రిఁ గాంచి
యింత దురితం బొనర్చితినే? యటంచు

నెడఁద కంపింప మెయి గగుర్పొడువ భీతి
నెట్టకేలకు గృహమున కేఁగె వాఁడు.

చ. చని తన కాంతనుం దఱిసి
చోరుఁడు వల్కెను "ప్రేయసీమణీ!
దినదినముం ద్వదర్థముగఁ దెత్తును
విత్తము ప్రుచ్చిలించుచున్
జనుల వధించుచున్ మది ముసళ్ళని
స్త్రీలని బాలురంచు శం
కను గొన, కే యఘంబున సగంబగు
నీకు; సగంబు నా కగున్."

క. అనవుడు నది "నే నేటికిఁ
గొనుదుం బాపంబుపాలు? కొంటివి నన్నా
లినిగాఁ: గావున నన్నున్
మనుపవలయుఁ బట్టి యెట్టిమార్గము నయినన్.

క. ఒనరించుచు దురితంబులు
మనుపుము నన్నంటి నొక్కొ? మనుపఁగ నన్నుం
గన కన్యోపాయం బిటు
లనుచితముల కొడిగట్టి తఘమది నీదే!

ఆ. నీవు దెచ్చుచుండ నేనేల వలదందు?
ననుభవింతు నిచ్చినట్టిదెల్ల;

నిన్ను సౌఖ్యపఱతు; నీదు పాపంబు సాఁ
బాలుగాదు; గొనను బరకమేని."

అనవుడు ననుతాపానల
మున నుల్లము వేఁగఁ, బాపముఁ దలంచుచు మె
ల్లన వచ్చి నారదమునీం
ద్రునికిం బ్రణమిల్లి దాని నొాకువులు వినిచెన్.

తెలిపి "నన్నుద్ధరింపుము ! దేవ ! నీదు
పాదముల నాశ్రయించితి వదలనింక
దాసుఁడను; దీనుఁడను; నీచతముఁడ; నీదు
దర్శనంబబ్బె నే సుకృతంబు గలదొ ?

చేయుము నాకుచితంబగు
ప్రాయశ్చిత్తం" బటంచుఁ బలుకఁగ మునియుం
జేయిడి వాని శిరంబునఁ
"బాయుంబో ! నీయనంత పాపము" లనుచున్.

రామనామం బతండు విలోమరీతి
వాని కుపదేశమిడె శీఘ్ర ఫలదమగుట
నన్నపానీయములుమానీ యాతఁ డట్టు
లుచ్చరించుచుఁ గూర్చుండె నొక్కచోట.

దినవారపక్షమాసము
లనేకములు నేండ్లుఁ బూండ్లు నల్లేయుండెన్

అనితరమగు భక్తిని నా
తని మేనం బుట్టవోసెఁ దడవులు గడపన్.

ఉ. నారదుఁడొక్కనాఁడు హరి
నామము బాడుచు మింటఁబోవుచా
వారిని "రామ రామ" యను
తద్గళ శబ్దము నాలకించి వే
ధారుణిపైకి డిగ్గి యెడఁదన్
స్మరియించి పురాకథన్ దగన్
దూరగతాఘుఁడైన మహితున్
వెలికెత్తెను వామలూరుగున్.

గీ. మును లకారణబాంధవు లినుముఁదాఁకి
స్పర్శవేధి సువర్ణముం జలుపునట్లు
దర్శన మొసంగి సదుపదేశం బొసంగి
పతితుల సముద్ధరింత్రు పావనులఁజేసి.

## ౩. ఒక సాధువు

క కలఁడొకసాదు మహాత్ముం
డలోక సామాన్యశీలుఁ; డతఁడు వసించున్
వెలుపట నూరికి నొక దే
వళమున సేవింపఁ దన్ను భక్తు లనేకుల్.

ఊరి గృహస్థు గృహంబునఁ
జోరీ జరిగినది; పోయె సొమ్ము కడిఁది: యా
చోరునిఁ బట్టఁగ నాగే
ప్రారంభ మొనర్చె నచ్చటిచ్చటి బహుధా.

తలఁచి "యీ సాధువే సొత్తు తస్కరించెఁ
గాఁడితఁడుఁ"డంచు వాని నిక్కచ్చిపఱప
"నపహృత ద్రవ్య మెం" తని యడిగె సాము
అనె గృహస్థు "సహస్ర రూప్యము" లటంచు.

కొదుకక వేయిరూప్యములఁ
గొమ్మని గేస్తున కిచ్చె సాము: స
మ్మదమున నాతఁడేఁగె దనమందిర;
మత్తఱి "సొత్తుతోడ దొం
గ దొరికె"నంచు రక్షకనికాయము
గేస్తుకు విన్నవించి యొ
ప్పిదముగ నప్పగించి రది వెయియుఁ
దగ్గక యొక్కటేనియుఁ౯.

ఎద గేస్తిట్లు తలంచె "దేవసము నిస్సీ!
నేను దొంగంచుఁ బ్రి
ల్లదముల్ వల్కఁగఁ గాదునా కొసఁగె
సంశ్లాఘ్యుండు సొమ్మెల్లః నా

మది క్షోభిల్లు; మహాపరాధిని;
నెటుల్ మాయున్ మహాకిల్బిషం
బిది? యిప్డే చని యిచ్చి క్రమ్మఱ ధనం
బే మ్రొక్కుదున్ పైఁబడఁగన్."

క. అని యేఁగి సాధుపదములఁ
బ్రణమిలి వేరూప్యములను ప్రత్యర్పింపం
గ నతండు 'వలదు వలదిది,
కొన నిచ్చిన దానిఁ దిరిగి కొమ్మవె' యనెన్.

క. అనుకొనె గృహస్థు కని యా
ధనంబు; 'గాదిది ధనంబు; తలఁతును నా పా
పనికాయంబని; యీ బ
ర్వును మోయఁగఁజాల నిత్తుఁబో! దానముగన్.'

క. పంచిచ్చి బీదసాదుల
కంచితముగ వాని భక్తుఁడై పాపము మా
యించుకొని పుణ్యము నుపా
ర్జించుకొని గడించెవాఁడు శ్రేయముఁ దుదికిన్.

## ౮. సంకీర్తన ప్రభావము

క. కలఁడు 'వితోబా' భక్తుఁడు;
సలుపును బహుభక్తి నామసంకీర్తన ని
చ్చలతండు; శల్యశల్యం
బుల నరనరములకు నంటిపోయె నదియునున్.

క. ఒకనాఁడు పోవుచుండఁగ
నకటా! యతఁ డెటకో! యొక మహోకుడ్యము కహా
లి దభావశిష్టుఁ డయ్యెఁ బ
థికతతితోపాటు మృత్తతిం బూడుకొనెన్.

క. తదుదంత మెఱుఁగఁజాలక
తదీయ శిష్యాళి పెక్కుతావు లరయుచున్
పిదప బహుకాలమున కా
ప్రదేశమున కేఁగఁ గుడ్యపాతము దెలిసెన్.

గీ. పథిక బృందంబుతోపాటు వాసియుండుఁ
బ్రాణములు; మట్టిలోఁబూడి యాతఁడనుచు
నెదఁ గుమారిలి యాశిష్యు లెట్టకేల
కామృతాంగంబుఁ ద్రవ్వి తీయంగడంగి.

గీ. మట్టిఁ ద్రవ్వంగ నచటఁ గన్పట్టెఁ బెద్ద
శల్యబృందంబు; గుర్తింపఁ జాలు టెట్లు?
వారు ప్రతిశల్యముం దీసి పైకిఁ దమదు
చెవికడం బెట్టుకొని పరీక్షించికొనిరి.

గీ. గురుని శల్యంబులన్నియు వెఱఁగుసుమ్ము!
నను "విఠోబ! విఠోబా" యటంచు మెల్ల
నట్టివానిని నేఁటి వా రవని నొకట
స్థాపిత మొనర్చి కట్టిరి చైత్య మొకటి.

## [illegible]. ధర్మరాజు - దుర్యోధనుఁడు

గీ. ఆయుధిష్ఠిరు భగవానుఁడైన కృష్ణుఁ
డడిగె నొకతూరి “నొక దుష్టుఁడైన జనుని
వెదకికొని రమ్ము! పోయి యీ విశ్వమందు”
ననఁగ శిరసావహించి తదాజ్ఞఁ జనియె.

గీ. నేల నాలుగుఁ జెఱఁగులుఁ జాలతడవు
పర్యటించి నివృత్తుఁడై పద్మనాభు
దర్శన మొనర్చి తెలిపె “నుత్తముఁడు దక్కఁ
గానఁబడఁడయ్యెదుష్టుఁ డొక్కఁడు” నటంచు.

గీ. అంత దుర్యోధనుఁ డాసి హరి వచించె,
“జగమునెల్లఁ జరించి సజ్జనుని నొకని
వెదకి తె” మ్మని; యాతండు గొదుక కేఁగెఁ ;
దిరిగి నలుగడ లేతెంచి తెలిపె నిట్లు.

గీ. “దుర్జనుఁడు దక్క నెందు మందునకు నేని
సజ్జనుఁడు గానఁబడఁడయ్యె జగతి” ననుడుఁ
దనదు ప్రతిబింబముం దక్క జనుఁడు గనునె ?
యద్దమున భిన్నము నటంచు హరి వచించె.

రామదాస కథావళి సమాప్తము.

★